## మాల్టెక్స్ బిస్కట్లను తింటూ ఆడుకొందాము



పిల్లల జీవిత విధానమే ప్రత్యేకముగా ఉంటుంది. వారికి ఆడుకోవడము అంటే ఎంతో యిష్టము. అలాగే మాల్టెక్స్ బిస్కట్లను తినడము కూడాను. సాతె మాల్టెక్స్ బిస్కట్లు పిన్నా పెద్దలకు ప్రతి రోజూ ఎంతో అవసరమైన అదనపు శక్తిని అందచేస్తాయి.



**సాతె బిస్కట్లు**

తరతరముల వారికి శక్తిని యిచ్చే ఆహారము




సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి., పూనా-2



# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# పరమానందము

అసలైన
గొల్లభామ డబ్బాలకే
మూతమీద
ఎంబాస్ ముద్ర
ఉంటుంది.




గొల్లభామ మార్కు గడ్డ పాల డబ్బా మూత తీయండి — ఉత్తేజాన్ని కల్గించే పుష్టికర పదార్థము నిండాగల డబ్బాను తెరిచారన్నమాట. ఎందుకంటే ప్రతి గొల్లభామ డబ్బా శుద్ధమైన తీయని తాజా పాలు రుచికరంగా మీగడంత చిక్కగా గట్టిపరచబడి నిండి తొణికిస లాడుతూంటుంది కుటుంబంలో అందరికి ఇష్టమై శుద్ధమైన పాల వస్తువను రుచికరంగా అనుభవించడానికి, ఉత్తేజాన్ని కల్గించి పరమానందాన్ని పొందించడానికి గొల్లభామ గడ్డ పాలు విశిష్టమైనవి !



## గొల్లభామ

మార్కు

పూర్తి మీగడగల తియ్యని గడ్డ పాలు




నెస్లల్ ఉత్పాదన.

గమనిక. డబ్బా మూతను పూర్తిగా తీయండి. లోపల పాలను గాజు జాడీ లోకో గిన్నె లోకో వంచండి.

---





నాణ్యత నెఱిగి...

## న్యూట్రిన్ కొనండి




Sweets

NC-84



న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్

చిత్తూరు, ఆం. ప్ర.

# చందమామ

ఇప్పుడు 6 భాషలలో ప్రతినెలా వెలువడుతున్నది:

తెలుగు - కన్నడము - తమిళము

హిందీ - మహరాష్ట్ర - గుజరాతీ

★

చందమామ నెలనెలా 2,50,000 గృహాలను అలంకరిస్తుంది

★

మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచారసాధనం.

వివరములకు :

చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.

## సెప్టెంబర్ 1963

"యుక్తి గల కళాసు", "దుష్టులతో సహవాసం", "పొడుపు కథ" మున్నగునవి చక్కగానున్నవి. సీరియల్ "రాకాసిలోయ" చదివిన కొలది చదవవలెనని ఉంది.

—రుద్ద్రరాజు వెంకటసూర్యనారాయణ రాజు, గంపవరం

"ఉల్కాలు" యెంతో ఆసక్తితో చదివాను. "భారత చరిత్ర" చదువుతుంటే దేశభక్తి పుట్టుకొస్తోంది.

—తాతిని వెంకటగిరి నరసింహమూర్తి, మోర్త

"చందమామ" వడ్డాది పాపయ్యాగారి ముఖచిత్రాలంకరణతో చూడ ముచ్చటగా ఉంది. "రాజకుమారి జులేకా", "దుష్టులతో సావాసం", "పొడుపు కథ" చాలా బాగున్నాయి. "రాకాసిలోయ" సంగతి ఇంక చెప్పే అక్కరలేదు.

—వై. వి. యస్., ఏలేశ్వరం

"యుక్తి గల కళాసు", "దుష్టులతో సహవాసం", "భారత చరిత్ర", "పొడుపు కథ" చాల బాగున్నాయ్. ఇటువంటి కథలు ప్రతి నెల ప్రచురిస్తారని ప్రార్థిస్తున్నాం.

—ఆర్. సుధాకర్‌రావు, వెలికట్టె

అన్ని కథలకన్నా "రాకుమారి జులేకా" అనే కథ నన్నెంతో ఆకర్షించినది. "పొడుపు కథ" గమ్మత్తుగ ఉన్నది. "దుష్టులతో సహవాసం" చాలా బాగున్నది.

—పక్కలగడ్డ సత్యనారాయణ, బాపట్ల

అందచందాలతో నిండి ఆనందమిచ్చే "చందమామ"లోని "రాకాసిలోయ" చదువుతుంటే సింహలీక భయం నన్ను కూడ పీకుతుంది. "దుష్టులతో సహవాసం" చాలా హృద్యంగా ఉంది. "మృత్యులోయ" (ప్రపంచపు వింతలు) చాలా బాగుంది. "కిష్కింధాకాండ"లోని శంకర్ వర్ణచిత్రాలు కన్నులపండువుగా ఉన్నాయి.

—యం. విజయలక్ష్మి, రాగంపేట

"దుష్టులతో సహవాసం" అన్న బేతాళ కథలో పిశాచాలు దుష్టపని చెయ్యలేదు. మరి ఆ కథకు ఆ పేరెందుకు పెట్టారు. తెలియదు...ఉల్కలను గురించి బాగా విపులంగా వ్రాశారు, నాకు చాలా సంతోషం.

—అరిమండ్ల కృష్ణ, భద్రిరాజుపాలెం

ఈ నెల "చందమామ" అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ముఖ్యంగా "యుక్తి గల కళాసు", గుండుభీమన్న కథలు నన్నెంతో ఆకర్షించాయి. "దుష్టులతో సహవాసం" ఏమీ బాగుగా లేదు. "రాకాసిలోయ" సీరియల్ చదువుతున్నంతసేపు ఉత్సాహాన్ని ఉప్పొంగిస్తుంది.

—కె. కనకలింగేశ్వరరావు, ఏలూరు

ఆగస్టు సంచికలో అన్ని కథలకంటె "రాజకుమారి జులేకా" రసవంతంగా ఉండి, ఆకర్షించినది. "రాకాసిలోయ", "దుష్టుల సహవాసం", "రామాయణం" చాల బాగున్నాయి. భీమన్న యీసారి యువరాజునే మించిపోయాడు.

—అరసవెల్లి వెంకటసరసయ్య, శ్రీకాకుళం

# వాటర్‌బరీస్

# విటమిన్ కాంపౌండ్‌ను

# మీరు ఎపుడు తీసుకోవాలి?




■ వాటర్ బరీస్ విటమిన్ కాంపౌండు, పిల్లలకు పెద్దవారికి, అన్ని వాతావరణములలోను... సంవత్సరములో అన్ని కాలములందు ... సిఫారసు చేయబడిన సాధారణమైన టానిక్.

■ ఎక్కువగా విటమిన్ బి కాంప్లెక్స్, మాల్ట్ ఎక్స్‌ట్రాక్టు మరియు ఆరోగ్యమునకు, సత్తువకు ముఖ్యావసరమైన ఇతర పదార్థములు కలిగి వాటర్ బరీస్ విటమిన్ కాంపౌండు ఆకలిని పుట్టించి సుఖముగా నుంచును.

## వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండు

వార్నర్-లేంబర్ట్ ఫార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు. ఎస్. ఎలో స్థాపితము)

WLY-9 TEL


LIFEBUOY
SOAP
ఎక్కడ
లైఫ్‌బాయ్ ఉన్నదో
అక్కడ ఆరోగ్యము ఉన్నది
లైఫ్‌బాయ్ సబ్బు మురికిని మురికిలోగల క్రిములను కడిగివేయును. లైఫ్‌బాయ్ వల్ల - కుటుంబములో అందరి జీవితం ఆరోగ్యవంతం !
హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి
L.40-77.TL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

గత మాసపు సంచికలో తాతయ్య కథలూ, రామ తీర్థ కథలూ నిలిపివేశాము. ఈ సంచికలో మరి ఒక మార్పు చేశాము. మహాభారతం కథ నాలుగు పేజీలకు పెంచాము.

"గుండు భీమన్న" కథలు ఈ సంచికతో సమాప్త మవుతున్నాయి. అదేవిధంగా "రాకుమారి జులేకా" కూడా అంతమవుతున్నది. దాని స్థానంలో పై సంచిక నుంచి "చందమామ మందహాసం" అనే మరొక అరబ్బీ కథ ప్రారంభ మవుతుంది.

శీర్షికలు తగ్గించటం వల్ల పాఠకులకు విడి కథలు హెచ్చుగా అందించే అవకాశం కలుగుతుంది గనక ఈ మార్పులు పాఠకులకు ఆమోదకరం కాగలవని నమ్ముతున్నాము.





సంపుటి: 33 - సెప్టెంబర్ 1963 - సంచిక: 3





# భారత చరిత్ర



అలాఉద్దీన్ విశ్వాసాన్ని చూరగొన్న కొజ్జావాడు కాఫూర్ విద్రోహంలో తన యజమానికి ఏమాత్రమూ తీసిపోడు. అలాఉద్దీన్ చనిపోయిన మరుక్షణమే అతను అధికారం హస్తగతం చేసుకొనడానికి కుట్ర ప్రారంభించాడు. సుల్తాను చచ్చిన మర్నాడే కాఫూర్ సుల్తాను మరణశాసనం ఒకటి బయటపెట్టాడు. ఇది కృత్రిమ పత్రమైనా కావాలి, లేక సుల్తానును ఒత్తిడి చేసి తయారు చేయించినదైనా కావాలి. ఈ శాసనం ప్రకారం ఖిజ్ర్‌ఖానుకు రాజ్యార్హత లేకుండా పోయింది. అయిదారేళ్ళ ప్రాయం గల షిహాబుద్దీన్ ఉమర్ సింహాసనానికి వారసుడుగా పేర్కొనబడ్డాడు!

ఈ కుర్రవాడికి పట్టం కట్టి, తాను రాజప్రతినిధి అయి, కాఫూర్ నిరంకుశ పరిపాలన సాగించాడు. రాజ్యలోభంతో అతను అనేక ఘాతుక కృత్యాలు చేశాడు. అలాఉద్దీన్ పెద్ద కొడుకులైన ఖిజ్ర్‌ఖాన్, షాదీఖాన్‌ల కళ్ళు తీయించాడు; రాజమాత ద్రవ్యమంతా అపహరించి, ఆమెను కారాగృహంలో పెట్టించాడు; అలాఉద్దీన్ మూడవ కొడుకైన ముబారక్‌ను ఒక భవనంలో నిర్బంధించి, అతని కళ్ళు కూడా తీయించాలని చూశాడు. కాని 35 రోజుల దుష్పరిపాలనకే కాఫూర్ పాపాలు పండాయి. అలాఉద్దీన్ మాజీ భృత్యులు అతణ్ణి హత్య చేసేశారు. అప్పుడు ఢిల్లీలోని పెద్దలు ముబారక్‌ను చెరవిడిపించి తెచ్చి, బాలుడైన ఉమర్‌కు రాజప్రతినిధిగా ఏర్పాటుచేశారు. ముబారక్ 64 రోజులపాటు రాజప్రతినిధిగా ఉండి, 1316 ఏప్రిల్‌లో తన తమ్ముణ్ణి అంధుణ్ణి చేసి, కుతుబుద్దీన్ ముబారక్ షా అనే పేరుతో ఢిల్లీ సింహాసనం ఎక్కాడు.

కుతుబుద్దీన్ ముబారక్ పరిపాలన కొద్దికాలంపాటు విజయవంతంగానే సాగింది.

## 24. ఖిల్జీల అంత్య దశ

తన తండ్రి చేసిన కఠిన శాసనాలు కొన్నిటిని అతను రద్దు చేశాడు, రాజకీయ ఖైదీలను విడిపించాడు; ఊడలాక్కున్న మాన్యాలను తిరిగి ఇచ్చేశాడు; నిర్బంధ సుంకాలను ఎత్తివేశాడు. ఈవిధంగా ముబారక్ ప్రజా రంజకుడయినాడన్న మాటేగాని, ప్రజలలో రాజభీతీ, గౌరవమూ సన్నగిల్లాయి.

దీనికి తోడు ముబారక్ త్వరలోనే రాజకీయాలు విస్మరించి భోగలాలసుడై పోయాడు. అతను పరిపాలించిన నాలుగేళ్ల నాలుగు మాసాల కాలంలోనూ అతనికి తాగుడూ, సంగీతమూ, వినోదాలూ, కాను కలు వెదజల్లటమూ తప్ప మరే పనీ లేక పోయిందని అనాటి చరిత్రకారుడు వ్రాశాడు.

సుల్తాను, ఖుస్రవ్‌ఖాన్ అనే ఒక నీచుడి చేతిలో కీలుబొమ్మ అయాడు. ఈ ఖుస్రవ్ ఖాన్ మతం మార్చుకున్న ఒక హీనజాతి గుజరాతీవాడు. ఎప్పటికైనా రాజు కావాలనే దురాశతో అతను సుల్తానుకు నీచమైన అభిరుచులు మప్పాడు.

ముబారక్ హయాములో మంగోలులు దండయాత్రలు చెయ్యకపోవటం భారత దేశాని కొక గొప్ప మేలయింది. గుజరాతు లోనూ, దేవగిరి (దక్కను)లోనూ రెండు తిరుగుబాట్లు మాత్రమే జరిగాయి. గుజరాతు



తిరుగుబాటు అణచబడింది, సుల్తాను మామ గారు గుజరాతులో గవర్నరుగా నియమించ బడ్డాడు. దేవగిరి పైకి సుల్తాను స్వయంగా సేనలను నడిపించాడు. దేవగిరి రాజైన హరపాలదేవుడు పారిపోవ యత్నించి, చిక్కిపోయి, దుర్మరణం పాలయాడు. మలిక్ యక్లకీ అనేవాడు దేవగిరికి గవర్న రుగా నియమించబడ్డాడు. ఈ విధంగా యాదవరాజ్యం నేరుగా సుల్తాను పరిపాలన కిందికి వచ్చింది. సుల్తాను తెలంగాణం పైకి ఖుస్రవ్‌ఖాన్‌ను పంపి, తాను ఏడాదిపాటు దేవగిరిలోనే ఉండి, అక్కడ ఒక పెద్ద మసీదు కట్టించి, ఢిల్లీకి తిరిగి వచ్చాడు.

ముబారక్ ఖలీఫాల అధికృతను తోసి వేసి, ఇస్లాము మతానికి తానే అధిపతిననీ, స్వర్గంలో ఉన్న దేవుడి ఖలీఫాను తానేననీ ప్రకటించి, "అల్‌వాసిక్ బిల్లా" అనే బిరుదు కూడా తగిలించుకున్నాడు.

ఖుస్రవ్ సుల్తానును హతమార్చటానికి యత్నాలు చేస్తున్నట్టు మిత్రులు చెప్పినా లాభంలేకపోయింది. అతను ఖుస్రవ్‌ను పూర్తిగా నమ్మి మోసపోయాడు. 1320 ఏప్రిల్ మాసంలో ఒకనాటి రాత్రి ఖుస్రవ్ భృత్యులలో ఒక హీనజాతివాడు సుల్తానును పొడిచి చంపాడు. అంతటితో 30 ఏళ్ళ ఖల్జీల పరిపాలన అంతమయింది.

ఖుస్రవ్ "నాసిరుద్దీన్ ఖుస్రవ్ షా" అనే పేరుతో ఢిల్లీ సింహాసనం ఎక్కి, తనకు సహాయపడిన బంధువులకూ, ఆటవికులకూ బహుమానాలు పంచాడు. తన ఆధిపత్యం ఆమోదించిన పెద్దలకు లంచాలు పెట్టడం కోసం ఢిల్లీ ఖజానా ఖాళీ చేశాడు. సుల్తాను మిత్రుల పైనా, భృత్యుల పైనా దారుణ హింసాకాండ సాగించి, అతని కుటుంబాన్ని అవమానంపాలు చేశాడు. అతను హిందువుల పట్ల పక్షపాతం చూపాడు. అతని పరిపాలన సాగిన నాలుగు నెలల కొద్ది రోజుల కాలంలో హిందువులు ఉన్నతస్థానాలలోకి వచ్చారు. ఇదే కారణంచేతనే కావచ్చు, అలాయీ కులీనులకు ఖుస్రవ్ ధోరణి నచ్చలేదు. ఘాజీమలిక్ అనే వాడి నాయకత్వం కింద వారు సుల్తానును ప్రతిఘటించ సమకట్టారు. ఘాజీమలిక్ దిపాల్పూర్ నుంచి బయలుదేరి వచ్చి 1320 సెప్టెంబరు 5 న ఢిల్లీ వద్ద ఖుస్రవ్‌ను ఓడించాడు. ఖుస్రవ్‌కు శిరచ్ఛేదం చేశారు. ఘాజీమలిక్ సుల్తాను కావాలన్నకాంక్ష కనబరచలేదు. తనకు సింహాసనం వద్దని కూడా అన్నాడు. కాని ఢిల్లీ పెద్దల కోరికపై ఘియాసుద్దీన్ తుఘ్లక్ అన్న పేరుతో అతను 1320 సెప్టెంబరులో ఢిల్లీ సింహాసనం ఎక్కాడు.






# మహాభారతం

ధృతరాష్ట్రుడు ఆశ్రమవాసానికి బయలు దేరటానికి అవసరమైన ప్రయత్నాలకు ధర్మ రాజు ఉత్తరు విచ్చాడు. ఈ వార్త త్వర లోనే హస్తినాపుర మంతటా వ్యాపించింది. నగరంలోని పౌరులు అన్ని వర్గాల వారూ రాజభవనం వెలపల గుంపులు కూడారు.

అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారితో కూడా అంతఃపురం నుంచి బయటికి వచ్చి ప్రజలతో, "ప్రజలారా, నేనూ గాంధారీ కలసి అరణ్యానికి పోవ నిశ్చయించాం. ఇందుకు వ్యాసమహర్షీ, మా ధర్మరాజూ కూడా సమ్మతించారు. మీరు కూడా సమ్మ తిస్తారని నమ్ముతున్నాను. మీకూ నాకూ ఉండే అన్యోన్యం శాశ్వతమైనది. నేను ముసలితనం వల్లా, కొడుకులను పోగొట్టు కునీ కృశించి ఉన్నాను. రాజ్యభారం ధర్మ రాజు మీద పెట్టి తేలికపడాలని ఉన్నది. దుర్యోధనుడి పాలన కంటె ధర్మరాజు పాలన చాలా మేలని నా నమ్మకం. ఈ స్థితిలో వనవాసం కన్న నాకు ఉత్తమ మైనది లేదు. అందుకు మీరు అనుమతిం చాలి," అన్నాడు.

ఈ మాటలు విని ప్రజలు దుఃఖార్తులై తలా ఒక మాటా అన్నారు. ధృతరాష్ట్రుడు వారితో మళ్ళీ, "ఈ దేశాన్ని శంతనుడు పాలించాడు; భీష్ముడూ, విచిత్రవీర్యుడూ పాలించారు. మా తమ్ముడు పాండురాజు పాలించాడు. ఏదో నేను కూడా కొంత సేవ చేశాను. ఆ సేవలో తప్పులు జరిగితే క్షమిం చండి. మా దుర్యోధనుడు ఈ రాజ్యాన్ని నిష్కంటకంగా అనుభవించి, అహంకారి అయి క్షత్రియ వంశాలమధ్య గొప్ప యుద్ధం తెచ్చి పెట్టాడు. అందులో నా తప్పుకూడా కొంత ఉండి ఉండవచ్చు. మీరు దానిని మరచిపొండి. ఇప్పుడు కౌరవులకు కూడా ధర్మరాజే రాజు. తన నలుగురు తమ్ములూ


అట్ట చివరి బొమ్మ



ణుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ ప్రజల పక్షాన నేను చెప్పేదేమంటే, మీ పూర్వు లందరూ మమ్మల్ని ఎంతో ప్రీతితో పాలించారు. నీవూ మిత్రుడులాగే మమ్మేలావు. మీ దుర్యోధనుడు మా కెలాటి అపకారమూ చేసి ఉండలేదు. వ్యాసమహర్షి ఆమోదించిన పని తప్పక చేయదగినదే. కాని నీ వియోగం మాకు చిరకాలం బాధాకరంగానే ఉంటుంది. ధర్మరాజు వెయ్యేళ్ళు పరిపాలించాలని కోరుకుంటున్నాము," అన్నాడు.

తరవాత గాంధారీ ధృతరాష్ట్రులు ప్రజల వద్ద సెలవు పుచ్చుకుని అంతఃపురానికి తిరిగి వచ్చారు.

మంత్రులుగా అతను మిమ్మల్ని పాలిస్తాడు. అతన్ని మీకూ, మిమ్మల్ని అతనికీ అప్పగిస్తున్నాను. నా కొడుకులు చేసిన అపరాధాలన్నీ క్షమించమని నేనూ కుంతీ మిమ్మల్ని వేడుకుంటున్నాం. మా ప్రయాణానికి అనుమతించండి. మీ కందరికీ నమస్కారం," అన్నాడు.

ఈ మాటలు వింటుంటే ప్రజలకు దుఃఖం ఆగలేదు. కొంత సేపయాక వారు తమ ప్రతినిధిగా మాట్లాడటానికి ఒక బ్రాహ్మణుణ్ణి నియోగించారు. ఆ బ్రాహ్మ

ఆ రాత్రి గడిచింది. మర్నాడు ధృతరాష్ట్రుడు పంపగా విదురుడు ధర్మరాజు ఇంటికి వచ్చి, "ధృతరాష్ట్రుడు ఈ కార్తిక మాసంలో వనవాసానికి ప్రయాణం నిశ్చయించాడు. ఆయన భీష్మ ద్రోణులకూ, తన కొడుకులకూ, సైంధవుడికీ, ఇతర మిత్రులకూ శ్రాద్ధాలు పెడతాడట, కొంత ధనం కోరుతున్నాడు," అని చెప్పాడు.

ధన మివ్వటానికి ధర్మరాజూ, అర్జునుడూ సంతోషంతో ఒప్పుకున్నారు. కాని భీముడు అభ్యంతరం చెప్పాడు. అర్జునుడు భీము

డితో, "ఆయన శ్రాద్ధాలు జరిపేది భీష్ముడు లకే కద. కాలపరిస్థితిని బట్టి ఆయన మనని ధనం యాచించవలసి వచ్చింది. మనం ఒకప్పుడు ఆయనను యాచించిన వాళ్ళం కామా? అందుచేత ధనం ఇవ్వటానికి నీవు కూడా ఒప్పుకో. లేకపోతే నీకే అపకీర్తి. నా మాట నమ్మక పోతే ధర్మరాజు నడుగు," అన్నాడు.

భీముడు కోపంతో, "భీష్ముడు, ద్రోణుడు మొదలైన వారి శ్రాద్ధాలకు మనం ధనం ఇవ్వవచ్చు. కాని ఈ ధృతరాష్ట్రు డిప్పుడు శ్రాద్ధాలు చెయ్యవలసిన అవసరమేమిటి? దుర్యోధనాదులు ఉత్తమ లోకాలు లేక అలమటించనీ! కులనాశకులు భూమి యావత్తూ నాశనం చేసిపెట్టారు. నీవు పడ్డ కష్టాలన్నీ ఎలా మరిచావు? మనం కష్టాలు పడ్డ కాలంలో ఈయన మన కెలా పెత్తండ్రి కాకపోయాడో! జూదమప్పుడు ఈ ముసలి వాడు ఈ విదురుణ్ణే, 'మనవాళ్ళు గెలు స్తున్నారా?' అని అడగలేదా?" అని అర్జునుడితో అన్నాడు.

ధర్మరాజు అతన్ని, "చాల్లే, ఊరుకో!" అని మందలించాడు. ఆయన విదురుడితో, "ధృతరాష్ట్రుడు శ్రాద్ధాలకుగాను కోరే డబ్బంతా నేనే ఇస్తాను. భీముడు దిగులు




పడ నవసరంలేదు. అతను తాను పడిన కష్టాలను తలచుకుని ఏమేమో అన్నాడు, ఆ మాటలు పాటించ నవసరం లేదు," అన్నాడు.

విదురుడు ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగి వెళ్ళి, జరిగినదంతా చెప్పి, "ధర్మరాజూ, అర్జునుడూ కూడా అవసరమైన ధనం ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నారు. బ్రాహ్మ ణులకు దానాలు చేయవచ్చు," అన్నాడు.

ధృతరాష్ట్రు డీ మాటలకు సంతోషించి, బ్రాహ్మణులనూ ఋషులనూ పిలిపించి,

చనిపోయిన భీష్ముడు మొదలైన వారందరి పేరా అన్నపానాలూ, యానాలూ, వాహనాలూ, క్షేత్రాలూ, గజాశ్వాలూ, కన్యకలూ మొదలైన వాటిని దానా లిచ్చాడు.

ధృతరాష్ట్రుడు చనిపోయిన వారందరికీ పెద్ద ఎత్తున శ్రాద్ధయజ్ఞం చేస్తూంటే, ధర్మరాజు పంపిన గణకులూ, లేఖకులూ దగ్గిరే ఉండి, ఆయన ఎవరి కేమి ఇవ్వమంటే అది అంతా ఇస్తూ వచ్చారు.

మర్నాడు ధృతరాష్ట్రుడు పాండవులను పిలిపించి, కార్తిక యజ్ఞం చేసి, వనవాస దీక్ష బూని, వల్కలాజినాలు ధరించి, బంధుజన పరివృతుడై గాంధారీ సమేతంగా ఇంటి నుండి బయలుదేరాడు. ఆయన వెంట కౌరవ పాండవ స్త్రీలూ, పంచపాండవులూ, విదురసంజయులూ, యుయుత్సుడూ, గౌతముడూ, ధౌమ్యుడూ నడిచారు. గాంధారి చెయ్యి తన భుజాన వేసుకుని కుంతి ఆమెను నడిపించింది. ధృతరాష్ట్రుడు గాంధారి భుజంమీద చెయ్యి వేసి తాను నడిచాడు. ద్రౌపదీ సుభద్రల వెంట, పిల్లవాణ్ణి ఎత్తుకుని ఉత్తర కూడా నడిచింది. వీరందరి వెనకగా పౌరులు వచ్చారు. అందరి మనసులూ శోకంలో మునిగి ఉన్నాయి. ఆ నాడు పాండవులు జూదంలో ఓడిపోయి వెళ్ళేటప్పుడు ఉండిన స్థితి ఈనాడు మళ్ళీ హస్తినాపురంలో ఏర్పడింది.

అందరూ సింహద్వారం చేరగానే ధృతరాష్ట్రుడు పౌరులను ఇక ఉండమని చెప్పాడు. ధృతరాష్ట్రుడి వెంట వెళ్ళటానికి విదుర సంజయులకు మాత్రమే అనుమతి లభించింది. యుయుత్సుణ్ణీ, కృపుణ్ణీ, అంతఃపుర స్త్రీలతో సహా ధర్మరాజునూ ధృతరాష్ట్రుడు వెనక్కు వెళ్ళిపొమ్మన్నాడు. అందరూ నిలిచారు. ధర్మరాజు కుంతితో, "అమ్మా, నేను వీరి వెంట వెళతాను. నీవు ఆడవాళ్ళను తీసుకుని అంతఃపురానికి తిరిగి వెళ్ళు," అన్నాడు.






## 27

[కేశవుడూ అతడి అనుచరులు నిప్పులు కక్కే సింహం గుహ ప్రవేశించారు. వాళ్ళకు రాతి గద కనిపించింది. సింహం మీదికి రాగా గోమాంగ్ దానిని గదతో కొట్టాడు. అది గుహ విడిచి, రెక్కల మనుషులూ, బ్రహ్మదండి మాంత్రికుడూ వున్న ప్రదేశాని కేసి పరిగెత్త సాగింది. బ్రహ్మదండి హుం ఫట్ అంటూ అరవసాగాడు. తరవాత—]

బ్రహ్మదండి పెట్టే కేకలతో, రెక్కల మనుషులు చెల్లా చెదరుగా పారిపోతూ, ప్రాణభీతితో అరిచే అరుపులతో, మైదాన ప్రదేశమంతా దద్దరిల్లి పోయింది. నిప్పులు కక్కే సింహం మాత్రం రెక్కలమనుషుల జోలికి పోక, అల్లంత దూరంలోవున్న అడవి కేషి సూటిగా పరిగెత్తసాగింది.

సింహం బాగా బెదిరి పోయిందనీ, అది తన ప్రాణరక్షణకు అడవి కేసి పారి పోతున్నదనీ ముందుగా గ్రహించినవాడు, బ్రహ్మదండి మాంత్రికుడు. ఆ వెంటనే అతడు మంత్రదండాన్ని సింహం కేసి ఝుళి పిస్తూ, "జై కాలభైరవా! ఫట్ ఘట్ హుం... సింహాన్ని చెవులు పట్టుకుని, అడవి లోకి లాగెయ్, ఉపాసకుల ఊడల మర్రీ!" అంటూ ఒక పెనుకేక పెట్టి, "హేయ్, జితా శక్తి! మీ రెక్కడ? రండి, రండి, భయం లేదు. సింహాన్ని కాననంలోకి



తరిమేస్తున్నాను,'' అంటూ తన అంగరక్షకులను పిలిచాడు. కేక వింటూనే జిత, శక్తి వర్మలు ఒక చెట్టు చాటు నుంచి తొంగి చూసి, నిప్పులు కక్కే సింహం అరణ్యం కేసి దౌడు దీస్తున్నదని గ్రహించి, కత్తులు దూసి, గిరగిరా తిప్పుతూ, ''ఆఁ వచ్చాం, వచ్చాం, బ్రహ్మదండీ! సింహం మా కత్తి వేటుకు అందకుండా తప్పుకున్నది. అరణ్యంలోకి జొరబడి దాన్ని వేటాడమంటావా?'' అని అడిగారు.

బ్రహ్మదండి పెద్దగా నవ్వుతూ, ''మీ ధైర్య సాహసాలు నాకు తెలియనివా? అయినా, సింహాన్ని యిప్పుడు అరణ్యంలోకి వెళ్ళి వేటాడటం క్షేమం కాదు. ముందు రెక్కల పురుగుగాళ్ళకు ధైర్యం చెప్పి మంద వేయటం అవసరం. వాళ్ళ నాయకుడు... ఆ గూబ ముఖం వెధవ ఎక్కడ? వాణ్ణి వెంటనే యిక్కడికి పిలుచుకు రండి, లేకపోతే నేనే వాడున్న చోటుకు వస్తాను. నా అనుమానం రూఢి అయింది! ఆ కేశవుడి జుట్టు మన చేతికి దొరికినట్టే!'' అన్నాడు.

కేశవుడి పేరు వింటూనే జితశక్తివర్మలు ఉలిక్కి పడి చుట్టూ కలయ చూస్తూ, ''కేశవుడా? ఎక్కడ?'' అంటూ బ్రహ్మదండి కేసి అనుమానంగా చూశారు.

బ్రహ్మదండిమాంత్రికుడు ఏ మాత్రం తొణక్కుండా, ''జితా, శక్తీ! మీరు తొందర పడకండి! వాడెక్కడో యీ ప్రాంతాలనే తన అనుచరులతో తిరుగు తున్నాడు. మనం జాగ్రత్తగా తిరుగులేని పథకం ఒకటి వేసి వాళ్ళందర్నీ పట్టేయాలి? ముందు నేను చెప్పిన పని చెయ్యండి,'' అన్నాడు.

జిత, శక్తివర్మలు వెళ్ళేసరికి రెక్కల మనుషుల నాయకుడు తన అనుచరులందర్నీ ఒక చోటుకు చేర్చి, వాళ్ళు సింహాన్ని చూసి అంతగా హడలి చెల్లాచెదరైనందుకు కూకలు వేస్తున్నాడు: ''మనది గరుడ వంశం! మన శక్తికీ,

ఘాటికి యీ లోకంలో తిరుగు లేదు. మన వంశం వాళ్ళు తప్ప, ఆకాశంలోకి పక్షిలా ఎగర గలిగిన వాళ్ళు యింకెవరున్నారు? ఆ నిప్పులు కక్కే సింహాన్ని మీరు ఎగిరి వెళ్ళి, గరుడపక్షి సర్పాన్ని తన్నినట్టుగా తన్ని ముక్కలు ముక్కలు చేయవలసింది. అది చేయకపోగా పిరికివాళ్ళలా పారి పోతున్నారు!'' అంటున్నాడు వాడు.

జిత, శక్తివర్మలు అతణ్ణి సమీపించి బ్రహ్మదండి అతడి కోసం ఎదురు చూస్తున్నట్టు తెలియపరిచారు. బ్రహ్మదండి పేరు వింటూనే రెక్కల మనుషుల నాయకుడు, ముఖం కందగడ్డలా చేసుకుని, ''మీ బ్రహ్మదండి మాంత్రికుడంటే నాకు అపనమ్మకం కలుగుతున్నది. తన మంత్ర శక్తితో ప్రతిదాన్నీ భస్మం చేయగలనని చెపుతూంటాడే, ఆ సింహాన్ని ఎందుకని భస్మం చేయలేదు? అది అరణ్యంలోకి పారిపోయింది. అది ఏ క్షణాన్నయినా తిరిగి వచ్చి, మావాళ్ళ వ్యాయామ క్రీడల్ని పాడు చేయవచ్చు,'' అన్నాడు కోపంగా.

జిత, శక్తివర్మలు వంగి వంగి దణ్ణాలు పెడుతూ, ''ఆ నిప్పులు కక్కే సింహం కంటె కూడా ప్రమాదకరులైన వాళ్ళ వల్ల మనకు కీడు రానున్నది,'' అని చెప్పారు.



రెక్కల మనుషుల నాయకుడు తలకు తగిలించుకున్న గద్దముక్కు కుళాయిని ఒకసారి పైకెత్తి, ''మనకు కీడు రానున్నదా? ఎవర్నించి? ఆ బిడాలీ, శ్వానకర్ణి ముఠాలు ఏకమై మన మీదికి దండు రావటం లేదు గదా?'' అన్నాడు కొంచెం బెదురుగా.

''ఆ వివరాలు మాకు తెలియవు. మీరొక్కసారి దయ చేయండి. సర్వం బ్రహ్మదండి విరుక పరుస్తాడు,'' అన్నారు జిత, శక్తివర్మలు.

రెక్కల మనుషుల నాయకుడు బ్రహ్మదండి మాంత్రికు డున్న చోటుకు బయలు దేరాడు. అతణ్ణి అంత దూరాన రావటం



చూస్తూనే బ్రహ్మదండి కూచున్న రాతి మీది నుంచి లేచి, అతడికి ఎదురు వెళ్ళి, "పులుగురాయా! దయ చేయండి, దయ చేయండి," అంటూ ఆహ్వానించాడు.

పులుగురాయా, అన్న పిలుపుతో ఉబ్బిపోయిన రెక్కల మనుషుల నాయకుడు, బ్రహ్మదండిని సమీపిస్తూ గాలిలోకి కొంచెం ఎగిరి పెద్దగా నవ్వుతూ, "బ్రహ్మదండీ, ఏమిటి మనకు రానున్న కీడు? నీ వాలకం చూస్తే, అలాంటి ప్రమాదం ఏమీ వున్నట్టు లేదే," అన్నాడు.

"కీడా? అలాంటిదేమీ లేకపోగా, మనకు గొప్ప మేలు కలిగే లక్షణాలు కనబడుతున్నవి. అడవిలో నీ అనుచరుల నుంచి దేవతకు బలి యివ్వనున్న యిద్దరు గుహావాసులను విడిపించిన ద్రోహుల ముఠా, ఆ కొండ గుహల్లో ఎక్కడో దాగి వున్నదని, నాకు గట్టి నమ్మకం కలిగింది. నిప్పులు కక్కే సింహం వెనకా ముందులు చూడకుండా, మన జనాల్లో పడి పారిపోయిన తీరు చూస్తే, ఆ దుర్మార్గులు దాన్ని చంపేందుకు ప్రయత్నించారనీ, అది తప్పించుకు పరిగెత్తిందనీ తెలియటం లేదా?" అన్నాడు బ్రహ్మదండి ఉత్సాహంగా.

బ్రహ్మదండి యిలా అనగానే, పులుగురాయుడు ఎగిరి గంతేసి, "కేశవుడూ, వాడి అనుచరులా! ఇంక కావలసిం దేమిటి? నాకు అర్ధరాజ్యమూ, నీకు రాకాసిలోయలో వున్న వెండి బంగారాలూ! చూస్తారేం, పదండి, వాళ్ళనిప్పుడే కొండ గాలించి పట్టేద్దాం," అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు తనకు ప్రాణాపాయం కలిగినప్పుడల్లా, తనను పట్టుకున్న వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని వాగ్దానం చేశాడు. చండమండూకుడి నుంచి బయట పడేందుకు అతడికీ, తరవాత రెక్కల మనుషుల నాయకుడైన పులుగురాయుడికి

దొరికి అతడికీ, మీకు అర్ధరాజ్యం వస్తుందని మాట యిచ్చేశాడు. పైగా, చండమండూకుడి నరమాంస భక్షకులకు దొరికిన స్థూల కాయుణ్ణి, తనకు తోడుగా వుంటాడని చెప్పి, మండూకుణ్ణించి ఆ బానిస యజమానిని కాపాడి, తన వెంట తెచ్చుకున్నాడు.

పులుగురాయుడి తొందరపాటు చూసి బ్రహ్మదండి మాంత్రికుడు ముఖం చిట్లించి, "పులుగురాయా, యిది వేగిరపాటుకు సమయం కాదు. కేశవుడూ, అతడి వెంట వున్న జయమల్లూ, కోయవాడూ మహా జిత్తులమారి వెధవలు. మనం ఒక్కుమ్మడిగా కొండ గుహల కేసి వెళితే, వాళ్ళు గుహ కందరాల్లో పడి మనకు చిక్కకుండా పారిపోగలరు. వాళ్ళను గుహలు విడిచి వచ్చేలా చేయాలి. అప్పుడు మనం వాళ్ళను చేజిక్కించుకోవచ్చు," అన్నాడు.

"అదెలా సాధ్యం? నువ్వు చెప్పేదాన్ని బట్టి చూస్తే వాళ్ళేమీ అమాయకులు కాదే," అన్నాడు పులుగురాయుడు.

"వాళ్ళ జిత్తులమారి తనాన్ని, కాల భైరవుడి కరుణాకటాక్షం వల్ల నేను జయిస్తాను. దానికి మన స్థూలకాయుడు... ఆ బానిస యజమాని వున్నాడే...వాడి సహాయం అవసరం. ఆ మాంసం పోగును




పిలిపించండి," అన్నాడు బ్రహ్మదండి. వెంటనే పులుగురాయుడు తన అనుచరులను బానిస యజయజమాని కోసం పంపాడు. ఈ లోపల బ్రహ్మదండి, తన అంగరక్షకులైన జిత, శక్తివర్మలతో బయలుదేరి, కొంత దూరం వెళ్ళి, చెట్ల చాటున వున్న ఒక గుడిశె ముందు నిలబడ్డాడు.

"నీ ఎత్తుగడ ఏమిటి బ్రహ్మదండీ? మళ్ళీ ఏదో కొంప మీదికి తెచ్చేట్టున్నావు. ఆ మహాకాయుడికి ఎలాంటి పని ఒప్పచెప్ప బోతున్నావు?" అని అడిగాడు జితవర్మ.

"నీ చచ్చు ప్రశ్నలతో నా ఆలోచన చెడకొట్టకు. ఆ బానిస యజమానిని నర



భక్షకులు తినకుండా కాపాడింది, నేను. ఆ కారణం వల్ల వాడు నా బానిస కింద లెక్క. నేను యిష్టమొచ్చిన విధంగా వాణ్ణి ఉపయోగిస్తాను," అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు విసుగ్గా.

"వాడు, నీ బానిస ఎలా అవుతాడు? వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని ప్రమాణం చేశావుగదా?" అని అడిగాడు శక్తివర్మ.

"వాడికి అర్ధరాజ్యం యిప్పిస్తానని, ప్రమాణం చెయ్యలేదు. అర్ధరాజ్యంలో తనకు నచ్చిన వాళ్ళను బానిసలుగా పట్టుకుపోయి అమ్ముకునే అధికారం యిస్తానన్నాను," అన్నాడు బ్రహ్మదండి కోపంగా.



ఆ సమయంలో పులుగురాయుడు వాళ్ళను సమీపించి, "ఏమిటి, మీలోమీరు పోట్లాడుకుంటున్నారులా వుంది?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి చప్పున అతడి కేసి తిరిగి చిరునవ్వు నవ్వుతూ, "పోట్లాట కాదు. నా అంగరక్షకు లిద్దరూ స్వయంగా కొండ గుహల్లోకి వెళ్ళి, ఆ కేశవుడి ముఠాను పట్టుకొస్తామంటున్నారు. నేను తొందర పడవద్దని చెపుతున్నాను," అన్నాడు.

ఆ తరవాత ఒకటి రెండు నిమిషాలకు స్థూలకాయుడు రెక్కల మనుషుల వెంట బ్రహ్మదండి వున్న చోటుకు వచ్చి, "ఏం, మహామాంత్రికా! నాతో కావలసిన పనేమిటి?" అంటూ భుజాన వేళాడుతున్న కొరడా చేతిలోకి తీసుకున్నాడు.

బ్రహ్మదండి, స్థూలకాయుణ్ణి దూరంగా తీసుకుపోయి రహస్యంగా అతడితో కొంత సేపు మాట్లాడాడు. మాంత్రికుడి మాటలకు అతడు మొదట్లో భయం బెదురూ కనబరిచినా, అఖరుకు తృప్తుడైనట్టు ముఖం పెట్టి, కొరడాను పైకెత్తి పెద్దగా ఝళిపించి, కోర మీసాలను మెలి వేసి, ఒక రంకె వేశాడు.

బ్రహ్మదండి, పులుగురాయుడి దగ్గిరకు వచ్చి, "పులుగురాయేంద్రా! కేశవుడు యిక మన అరచేతి ఆమలకం, తిరుగు



లేదు. తమరూ, తమ అనుచరులు కొద్ది మందీ మాతో కలిసి, ఆ రాతి గుట్టలున్న ప్రదేశానికి రండి. స్థూలకాయుడు ఒక నాటకం ఆడబోతున్నాడు. అంతా ఒక్క నిమిషం పని. వివరాలు యిప్పుడడక్కండి," అన్నాడు ప్రాధేయపడుతున్నట్టు.

ఆ వెంటనే పులుగురాయుడు నలుగు రైదుగురు అనుచరులతో బ్రహ్మదండి చెప్పిన గుట్టల ప్రదేశానికి బయలుదేరాడు. బ్రహ్మదండీ, జిత శక్తివర్మలు అతణ్ణి అనుసరించారు. స్థూలకాయుడు కొరడాను గాలిలో గిర్రున తిప్పుతూ, వాళ్ళ వెనగ్గా నడిచి వెళ్ళి, గుట్టలలో వున్న ఒక పెద్ద రాతి మీద ఎక్కి, బ్రహ్మదండి మురా దగ్గిరకు రాగానే, వాళ్ళను కొట్టబోతున్న వాడిలా కొరడా ఝుళిపిస్తూ, "ఏయ్, బ్రహదండీ, జితశక్తి, పులుగురాయా! యిక మీరు నా నుంచి పారిపోలేరు. మిమ్మ ల్నందర్నీ, ఆ కేశవుడికి అమ్మేస్తాను. అతడి చేతిలో మీకు చిత్రవధ తప్పదు. మీరు చావగానే, ఆ కేశవుడు నిరాటంకంగా రాకాసిలోయకు వెళ్ళి ధనరాసులు తెచ్చు కుంటాడు. నేనూ అతడి వెంట వెళతాను," అంటూ కొండలు మార్మోగేలా అరవసాగాడు.

గుహ కప్పులో వున్న కంత కుండా యిదంతా చూస్తున్న కేశవుడికీ, జయ



మల్లుకూ, కోయగోమాంగ్‌కూ చాలా ఆశ్చర్యం కలిగింది. మహాక్రూరుడైన స్థూలకాయుడు బతికి వుండటమేగాక, వాడు బ్రహ్మదండినీ వాడి అనుచరులనూ బానిసలుగా పట్టుకున్నాడంటే, వాళ్ళకు నమ్మశక్యం కాకుండా వున్నది.

"కేశవా, యిందులో ఏదో పెద్ద మోసం వున్నది," అన్నాడు జయమల్లు. కేశవుడు ఏదో జవాబు చెప్ప బోయేంతలో, స్థూలకాయుడు కొరడాను ఛపీ మని ఒకసారి మోగించి, "యిక మీరంతా వెళ్ళండి, బ్రహ్మదండీ! జాగర్త, ఆ చీకటి గుడిశె దాటిపోయారో, నా నౌకర్లు మిమ్మల్నందర్నీ నిలువునా కోసేస్తారు," అంటూ గావు కేక పెట్టాడు. ఆ తరవాత బ్రహ్మదండీ వాళ్ళు వెళ్ళి పోవటం కేశవుడికీ అతడి అనుచరులకూ కనిపించింది. స్థూలకాయుడు మాత్రం యింకా రాతి మీదే నిలబడి మీసాలు మెలి వేస్తూ, కొరడాను గాలిలో తిప్పుతూ ఛెళ్ళు ఛెళ్ళుమనిపిస్తున్నాడు.

"మల్లూ! యిదే మనకు మంచి అదను. స్థూలకాయుణ్ణి పట్టుకుని అసలు రహస్యమేమిటో తెలుసుకుందాం. ఒకవేళ బ్రహ్మదండీ, రెక్కల మనుషులూ మన మీదికి దాడి చేయవస్తే, తిరిగి యిదే కంతకుండా గుహలో ప్రవేశించి కనబడకుండా మాయం కావచ్చు," అంటూ కేశవుడు కంత నుంచి బయిటికి వచ్చి, నేల మీద పాకుతూ స్థూలకాయుడు నిలబడి వున్న రాతి కేసి బయలు దేరాడు. జయమల్లు కేశవుణ్ణి తొందర పడవద్దని హెచ్చరించబోయాడు. కాని, కేశవుడు ఆ సరికే అయిదారు గజాల దూరం ముందుకు వెళ్ళిపోయాడు.

ఇక చేసేదిలేక జయమల్లూ, కోయగోమాంగ్‌లు కూడా కేశవుడి వెనక పాకుతూ బయలుదేరారు. —(ఇంకా వుంది)






# హృదయ పరివర్తన

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు అసాధ్యమైన పనికి పూనుకుని ఎంతో శ్రమ పడుతున్నావు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం ఉజ్జయినీపురాన్ని వీరసింహుడు అనే రాజు పాలించేవాడు. ఆయన పేరుకు తగినట్టు గొప్ప వీరుడే గాని పరిపాలన నిర్వహించటంలో ఆయనకు ఏమాత్రమూ ఆసక్తి లేదు. అందుచేత రాజ్యభారమంతా మంత్రులకూ, ఇతర ఉద్యోగులకూ వదిలి పెట్టి తాను నిశ్చింతగా కాలం గడపసాగాడు.

ఇలా ఉండగా వీరసింహుడికి ఒక రాత్రి విచిత్రమైన కల వచ్చింది. ఆ కలలో

## బేతాళ కథలు



ఆయనకు పురవీధులు కనిపించాయి. వాటిలో మనుషులకు బదులు నక్కలు తిరుగుతున్నాయి. ఈ కలను గురించి ఎంత ఆలోచించినా దాని భావం తెలియరాలేదు. ఆయన తన మంత్రులనూ, ఆస్థాన పండితులనూ, జ్యోతిష్కులనూ ఆ కలకు అర్థమేమిటని అడిగాడు. ఎవరికి తోచిన విధంగా వారు చెప్పారు. రాజుకు తృప్తి కలగలేదు. తనకు వచ్చిన కలకు అర్థమేమిటో చెప్పిన వారికి మంచి బహుమానం ఇస్తానని ఆయన చాటింపు వేయించాడు.

ఉజ్జయినీ పరిసరాలలో డడ్డరు డనే ఒక నిరుపేద వాడుండేవాడు. వాడు రోజూ అడవికి పోయి, ఎండు కట్టెలు కొట్టి తెచ్చి, వాటిని అమ్మి తన కుటుంబాన్ని పోషించుకునేవాడు. డడ్డరుడు ఒకనాడు తన అలవాటు చొప్పున అడవికి పోయేసరికి వాన వచ్చింది. వాడు ఒక చెట్టు కింద నిలబడి, తానూ, భార్యా బిడ్డలూ ఆ రోజుకు పస్తుండవలిసిందేనని దిగులు పడసాగాడు.

డడ్డరుడు వర్షాన్ని తిట్టుకుంటూ, విచారంలో మునిగి ఉండగా, "ఎవరు నీవు?" అన్న ప్రశ్న వినిపించింది. వాడు నిర్ఘాంతపోయి చుట్టూ చూసేసరికి ఒక పాము కనిపించింది. అది డడ్డరుడి కేసి చూస్తూ మనిషి భాషలో, "ఎందుకలా విచారంగా ఉన్నావు?" అని అడిగింది.

డడ్డరుడు ఆ పాముకు తన కథ చెప్పాడు. "ఈ వాన మూలంగా నా కివాళ ఎండు కట్టెలు దొరకవు. ఈ రోజు నేనూ, నా భార్యా, నా పిల్లలూ ఇంత గంజి కూడా లేకుండా పస్తుండవలిసిందే. ఈ స్థితిలో విచారం కాక ఏమున్నది?" అని వాడు పాముతో అన్నాడు.

"నీకు చాలా ధనం దొరికే ఉపాయం చెబుతాను. అందులో సగం తెచ్చి నా కిస్తానని మాట ఇస్తావా?" అని పాము అడిగింది.

డడ్డరుడు సంతోషంతో అంగీకరించి, "ఏమిటా ఉపాయం?" అని పామును అడిగాడు.

"రాజుగారికి, నగరమంతటా నక్కలు సంచరిస్తున్నట్టు కల వచ్చింది. ఆ కలకు ఎవరూ అర్థం చెప్పలేకపోయారు. అర్థం చెప్పిన వారికి మంచి బహుమాన మిస్తానని ఆయన చాటింపు కూడా వేయించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. ఆ కలకు అర్థమేమిటో నేను చెబుతాను. నీవు వెళ్ళి రాజుగారికి ఆ అర్థం చెప్పి, బహుమానం పుచ్చుకుని, అందులో సగం తెచ్చి నా కియ్యి," అన్నది పాము.

"తప్పక ఇస్తాను. ఇంతకూ రాజుగారి కలకు అర్థమేమిటి?" అని డడ్డరుడు పామును అడిగాడు.

"విను. రాజుగారికి గొప్ప శౌర్య పరాక్రమాలయితే ఉన్నాయి గాని, ఆయనకు పరిపాలన చెయ్యటం చేతకాదు. అందుచేత రాజకీయ వ్యవహారాలన్నీ మంత్రులకే వదిలేసి ఊరుకున్నాడు. చాలా కాలంగా ఆ మంత్రులు రాజభయమన్నది లేక తామే రాజుల్లాగా ప్రవర్తిస్తూ, లంచ గొండులై, అవినీతిగా తమ బొక్కసాలు నింపుకుంటూ, అధికారాన్ని పూర్తిగా




దుర్వినియోగపరుస్తూ వస్తున్నారు. వారిని బట్టి వారి కింది అధికారులూ అదే విధంగా చేస్తున్నారు. చివరకీ అవినీతి ప్రజలలోకి కూడా వ్యాపించింది. ఎవరికీ ఒక ధర్మం గాని, నీతిగాని, శాసనంగాని లేదు. అందుకే రాజుకు కలలో పురవీధుల వెంబడి మనుషులకు మారుగా నక్కలు సంచరించటం కనబడింది," అన్నది పాము.

డడ్డరుడు పాము చెప్పినదంతా బాగా గ్రహించి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, మీకు వచ్చిన కలకు అర్థం నేను చెబుతాను," అన్నాడు. రాజు చెప్పమన్నాడు. పాము చెప్పినదంతా డడ్డరుడు

రాజుకు చెప్పాడు. రాజు రహస్యంగా ఆచోకీ తీసిన మీదట డడ్డరుడు చెప్పినమాట అక్షరాలా నిజమని తేలింది. ఆయన డడ్డరుడికి మంచి బహుమానం ఇచ్చి పంపేశాడు. ఆ బహుమానంతో డడ్డరుడి దారిద్ర్యం తీరిపోయింది.

"ఈ డబ్బంతా నేనే ఉంచుకుంటే నా కుటుంబం ఎంత కాలమైనా సుఖంగా బతకవచ్చు. ఇందులో పాముకు సగం ఇవ్వటం దేనికి? పాము నే నిచ్చే డబ్బు ఏం చేసుకుంటుంది. నాకు దానితో అవసరం కూడా తీరిపోయిందాయె," అనుకుని డడ్డరుడు పాముకు మాట ఇచ్చిన ప్రకారం తన బహుమానంలో సగం వాటా ఇవ్వలేదు. ఈలోపుగా రాజుగారు లంచగొండులూ, అవినీతిపరులూ అయిన వారినందరినీ పదవులలో నుంచి తొలగించి కొత్తవారిని ఏర్పాటు చేసి తానే స్వయంగా రాజ్యవ్యవహారాలన్నీ చూడసాగాడు.

కొద్ది రోజులకు రాజుకు మరొక కల వచ్చింది. ఆ కలలో ఒక పెద్ద కత్తి మాత్రమే కనిపించింది. ఈ కల కూడా రాజుకు అర్థం కాలేదు. అందుచేత ఆయన డడ్డరుడి వద్దకు మనిషిని పంపి, తనకు వచ్చిన కలకు అర్థమేమిటో చెప్పి పొమ్మని కబురు చేశాడు.



దద్దరుడి నెత్తిన పిడుగు పడ్డట్టయింది. మళ్ళీ వాడు పామును ఆశ్రయించక తప్పదు. అందుచేత వాడు పాముకు ఏదో విధంగా క్షమాపణ చెప్పుకుని, సహాయం పొంద నిశ్చయించాడు. వాడు రాజుగారి మనిషితో, "నేను త్వరలోనే వస్తున్నాను. నీవు వెళ్ళు," అని చెప్పి పంపేసి, తిన్నగా అడవికి వెళ్ళి పాము కనిపించిన చోటికి చేరుకున్నాడు.

ఆ సమయానికే పాము తన పుట్టలో నుంచి బయటికి వచ్చి, దద్దరుడు రావటం చూసి, "మళ్ళీ ఎందుకు వచ్చావు?" అని ప్రశ్నించింది.

"రాజుగారికి మరొక కల వచ్చిందట. దానికి కూడా అర్థం చెప్పావంటే మళ్ళీ బహుమానం ఇస్తారు. రెంటికీ కలిపి నీ వాటా ఇచ్చేస్తాను. దయ వుంచి ఆ కలకు అర్థం చెప్పు," అని దద్దరు డడిగాడు.

"రాజుగారికి కలలో పెద్ద కత్తి కనిపించింది. దాని అర్థం చెబుతాను విను. రాజుగారు తన మంత్రులనూ, అవినీతి పరులైన ఉద్యోగులనూ తొలగించాడన్న మాటేగాని, వారిని తగిన విధంగా శిక్షించ లేదు. వారంతా రాజుగారిపై కుట్ర పన్ని, పొరుగు రాజుతో కూటం జరిపి యుద్ధానికి యత్నాలు చేస్తున్నారు. ఆ రాజు ఎప్పుడో





ఆకస్మికంగా వచ్చి పడతాడు. పదవులు పోయిన అధికార్లందరూ శత్రురాజుకు సహాయం చేస్తారు. ఇదే రాజుగారి కలకు అర్థం," అన్నది పాము.

డడ్డరుడు అక్కడి నుంచి తిన్నగా రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, తమకు కలలో పెద్ద ఖడ్గం కనిపించింది. దాని అర్థం ఇదీ," అంటూ పాము చెప్పినదంతా పూస గుచ్చినట్టు రాజుతో చెప్పాడు.

ఈసారి డడ్డరుడు తనకు వచ్చిన కల కూడా గ్రహించినందుకు రాజు ఆశ్చర్యపడి, మరింత పెద్ద బహుమానం ఇచ్చి వాణ్ణి పంపేసి, అప్పటికప్పుడే తన పాత ఉద్యోగుల నందరినీ కారాగృహంలో పెట్టించి, సేనలతో వెళ్ళి పొరుగు రాజుపైన పడి ఓడించి, ఆ రాజ్యం కూడా తన రాజ్యంలో కలుపుకున్నాడు. ఈలోపుగా డడ్డరుడు తన బహుమానం పుచ్చుకుని ఇంటికి వెళ్ళి, పాముకు దాని వాటా ఇవ్వ నవసరం లేదనీ, ఇక తాను దాని చాయలకు వెళ్ళ నవసరం ఉండదనీ, అదే వాటా కోసం తనను వెతుక్కుంటూ వస్తే దాన్ని చంపేద్దామనీ గట్టిగా తీర్మానించుకున్నాడు.

యుద్ధం ముగిసిన కొద్ది కాలానికి రాజుగారికి మరొక కల వచ్చింది. ఆ కలలో ఆయనకు పచ్చిక బీళ్ళూ, అందులో ఆవుల మందలూ కనిపించాయి. ఆయన మళ్ళీ డడ్డరుడి కోసం కబురు పెట్టాడు.

రాజుగారికి మళ్ళీ కల వచ్చిందనగానే డడ్డరుడికి కాళ్ళూ, చేతులూ చల్ల బడ్డాయి. ఎప్పటికప్పుడు తనకు పాముతో పని తీరిందనుకుంటూంటే మళ్ళీ మళ్ళీ దాని సహాయం అవసరమవుతున్నది. రాజుగారితో నిజం చెప్పేద్దామంటే ఇచ్చిన బహుమానాలు లాక్కుంటాడేమోనని భయం! పాముకు రెండుసార్లు వాటా ఎగగొట్టి మూడోసారి దాని మొహం చూడటానికి డడ్డరుడికి మొహం చెల్లలేదు.

అయినా తప్పదు గనక డడ్డరుడు రాజుగారి మనిషిని పంపేసి, తాను అడవిలో పాము పుట్ట ఉన్న చోటికి వెళ్ళాడు. పాము పుట్టలో నుంచి బయటికి వచ్చి, వాడు వచ్చిన పని అడిగింది.

"నేను ఇదివరకే వచ్చి నాకు ముట్టిన బహుమానంలో వాటా ఇచ్చి ఉండవలసింది. అలా చేయనందుకు మన్నించాలి. మళ్ళీ నాకు నీ సహాయం కావలిసి వచ్చింది. రాజుగారికి మళ్ళీ కల వచ్చిందట, అర్థం చెప్పమని కబురు చేశారు. మళ్ళీ బహుమానం ఇస్తారు. మూడు బహుమానాల తాలూకు నీ వాటా తెచ్చి నీ కిస్తాను. దయవుంచి రాజుగారి కలకు అర్థ మేమిటో చెప్పు," అన్నాడు డడ్డరుడు.

"రాజుగారికి కలలో ఆవుల మందలు కనిపించాయి. దేశమంతా సుభిక్షంగా ఉన్నదనీ, ధర్మం చక్కగా నడుస్తున్నదనీ దాని అర్థం," అని చెప్పి పాము పుట్టలోకి వెళ్ళిపోయింది.

డడ్డరుడు వెళ్ళి రాజుగారితో ఆయనకు వచ్చిన కలా, దాని అర్థమూ కూడా చెప్పాడు. రాజుగారు డడ్డరుడికి పూర్వం కన్న హెచ్చు బహుమానం యిచ్చి అతనికి తన కొలువులో చిన్న ఉద్యోగం కూడా ఇచ్చాడు.



డడ్డరుడు ఆ బహుమానం తీసుకుని తిన్నగా అడవికే వెళ్ళాడు. ఈసారి వాడికి పాము కనిపించలేదు. డడ్డరుడు పిలిచిన మీదట పాము పుట్టలో నుంచి బయటికి వచ్చి, "ఈసారి దేనికి వచ్చావు?" అని అడిగింది.

"ఇదుగో, రాజుగారి బహుమానం. ఇది నీ వాటాకు మించే ఉన్నది. అంతా నీవే తీసుకో! రాజుగారు నాకు తన కొలువులో ఉద్యోగం కూడా యిచ్చారు. నీ మేలు ఎన్నటికీ మరవను," అన్నాడు డడ్డరుడు.

పాము ఆ బహుమానాన్ని తీసుకోలేదు. "ఆ బహుమానం కూడా నీవే ఉంచుకో,"

అని డడ్డరుడితో చెప్పి పుట్టలోకి వెళ్ళింది. బేతాళుడీ కథ చెప్పి, "రాజా నా కొక్క సందేహం? రెండుసార్లు పాముకు వాటా ఇవ్వని డడ్డరుడు, దానిని చంపటానికి కూడా తీర్మానించుకున్నవాడు, మూడవసారి పాముకెందుకు వాటా ఇవ్వ చూపాడు? పాము అవాటాను ఎందుకు నిరాకరించింది? మొదటి రెండుసార్లూ ఇవ్వనందుకు పాము డడ్డరుడిపై అలిగిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పాము డడ్డరుడిపై అలగ లేదని స్పష్టమవుతూనే ఉన్నది. అది అలిగినట్టయితే డడ్డరుడికి రెండవసారీ, మూడవసారీ సహాయం చేసి ఉండదు. డడ్డరుడు పాముకు మొదట వాటా ఇవ్వక పోవటానికీ, తరవాత ఇవ్వటానికీ కూడా కారణాలు కనిపిస్తూనే ఉన్నాయి. మొదటిసారి వాడు పాము నుంచి రాజు కలకు అర్థం తెలుసుకున్న నాటికి ప్రజలలో నక్క స్వభావం వ్యాపించి ఉండింది. ఆ స్వభావం వాణ్ణికూడా పట్టి ఉన్నందున వాడు మొదటి బహుమానంలో పాముకు వాటా ఇవ్వలేదు. వాడు పాము నుంచి రెండో కలకు అర్థం తెలుసుకున్న సమయానికి దేశంలో రాజద్రోహబుద్ధీ, దౌర్జన్య స్వభావమూ ఉండింది. అందుచేతనే డడ్డరుడు పామును చంపాలన్న దాకా ఆలోచించాడు. రాజుకు మూడవ కల వచ్చే నాటికి రాజ్యం సుభిక్షమయింది. ప్రజలలో స్వార్థ చింతలేదు, భవిష్యత్తు గురించి భయంలేదు. అందుచేత డడ్డరుడు పాముకు ఉదారంగా, ఇవ్వవలసిన దానికన్న హెచ్చుగానే ఇవ్వబోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.

[పి. రమేష్‌చందర్ రచన ఆధారంగా]



# త్రిపీడలు

ఒకనాడు కుందేలు ఒంటరిగా కూచుని తనకు తానే ఈ విధంగా చెప్పుకున్నది:

"ప్రాణికి మూడు రకాల పీడలు కలుగుతాయి. మొదటివి ప్రకృతి సిద్ధమైనవి; భూకంపాలూ, తుపానులూ మొదలైనవి. రెండోవి తాత్కాలికమైనవి; అతివృష్టి, అనావృష్టి, కరువుకాటకాలూ మొదలైనవి. మూడోవి మానవ కల్పితాలు; వేటగాళ్ల వల్లా, చోరుల వల్లా కలిగేవి."

కుందేలు అనుకున్న ఈ మాటలను ఒక తీతువుపిట్టా, ఒక వానపామూ, ఒక కోతీ విన్నాయి. వాటికి భయం పట్టుకున్నది.

"ఆకాశం విరిగి నా మీద పడితే నేనేం కావాలి. మేలుకుని వుండగా పడితే ఫరవా లేదు. నిద్రపోతూండగా పడితే పచ్చడి అయిపోనా?" అనుకుని తీతువుపిట్ట అది మొదలు కాళ్లు పైకి పెట్టి, వెల్లికిలా పడుకుని నిద్రపోవటం అలవాటు చేసుకున్నది.

"కరువు వచ్చి నా ఆహారమైన మట్టి కాస్తా లేకుండా పోతే నా గతి ఏంకాను?" అనుకుని వానపాము అదిమొదలు తిన్న మట్టిని మళ్ళీ కక్కటం అలవాటు చేసుకున్నది.

చెట్టు మీద పడుకునే కోతి తన సొత్తయిన భూమిని దొంగలు అపహరించుకు పోతారేమో నని ప్రతి రాత్రీ రెండు మూడుసార్లు చెట్టు పై నుంచి దిగి వచ్చి చూసుకోవటం అలవాటు చేసుకున్నది.





# మొదలాడిన హరికథ

భీమన్న భార్య మహలక్ష్మి తొలిచూలు గర్భవతి అయి సకాలంలో మగ పిల్లవాణ్ణి కన్నది. జమీందారుగారికి మనవడు పుట్టాడని ఊరంతా సంబర పడ్డారు. ఇక భీమన్న సంతోషానికి మేరే లేదు. అటు వచ్చి, ఇటు వచ్చి పురిటి పిల్లవాణ్ణి చూసి అతను తెగ మురిసి పోయేవాడు.

ఒకరాత్రి పురిటి గదిలో పిల్లవాడు అకారణంగా పోరు పెట్టి ఏడవసాగాడు. వాడి ఏడుపు మాన్పటానికి మహలక్ష్మి ఏమి చేసినా ప్రయోజనం లేకపోయింది.

ఇంతలో గుండు భీమన్నకు ఒక విషయం జ్ఞాపకం వచ్చింది; పిల్లలు అకారణంగా ఏడిస్తే దయ్యాలు పారిపోతాయిట. దయ్యం ఎటుగా పారిపోతుందో చూద్దామని భీమన్న మిద్దె మీదికి ఎక్కి నాలుగు వైపులా పరికించి చూడసాగాడు. ఆ సమయంలో సామాన్ల కొట్టు వేపు నుంచి తపాతపా మంటూ శబ్దం విన వచ్చింది. ఒక ఎలుక ప్రమాద వశాన ఒక కాళీ జాడీలో పడి, పైకి రావటానికి ఎగిరి మళ్ళీ మళ్ళీ లోపలే పడుతున్నది. అదే భీమన్న విన్న శబ్దం.

కాని భీమన్నమటుకు దయ్యమే జాడీలో దాగి చప్పుడు చేస్తున్నదనుకుని, జాడీని తన పై పంచతో కప్పి, జాడీని అలాగే ఎత్తుకుని తోటకు వెళ్ళి, అక్కడ జాడీని పక్కకు పంచి, "ఏయ్, దయ్యమా! ఇదే నీ చోటు. ఇక్కడే ఉండు. ఈమారు ఇంటి కేసి వచ్చావో నిన్ను మారణ హోమం చేయిస్తాను," అని అరిచాడు.

జాడీలో ఉన్న ఎలుక ప్రాణాలతో బయట పడ్డందుకు సంతోషిస్తూ, చీకటిలో ఎటో పారిపోయింది.

భీమన్న ఎంతో గొప్ప ఘనకార్యం చేసినవాడిలాగా ఇంటికి తిరిగి వచ్చేసరికి పురిటి పిల్లాడు ఏడుపు మానేశాడు.

భీమన్న తన భార్య వద్దకు పోయి, "చూశావా, మన అబ్బాయి అకారణంగా ఏడిచే సరికి దయ్యం కాస్తా పారిపోయింది. దాన్ని జాడీలో బంధించి తీసుకుపోయి తోటలో వదిలేశాను," అన్నాడు.

"పిల్లవాడు అకారణంగా ఏమీ ఏడవ లేదు. వాడికి చీమ కుట్టింది. మీరు ఏ ఎలుకనో పట్టుకుపోయి ఉంటారు. దయ్యమూ లేదు, భూతమూ లేదు," అన్నది మహాలక్ష్మి.

ఆమె ఆ మాట అన్నాక భీమన్నకు కూడా జాడీలో నుంచి పారిపోయినది ఎలుక రూపంలో ఉండినట్టే అనిపించింది. అతను తన భార్య తెలివి తేటలకు ఎంతో ఆశ్చర్యపోయాడు.

జమీందారుగారు తన మనవడి బార సాలకు అందరికీ ఆహ్వానాలు పంపి, వచ్చే అతిథుల కోసం రోజు కొక వినోదం ఏర్పాటు చేశాడు.

రేపు బారసాల అనగా సాయంత్రంవేళ హరికథ ఏర్పాటయింది. పందిట్లో హరిదాసు గారు హరికథ ప్రారంభించాడు. ఊళ్ళో వాళ్ళు చాలామంది కథ వినటానికి వచ్చారు. పిల్ల లందరూ చేరి కేకలు పెట్టి అల్లరి చేస్తున్నారు.



తన గదిలో కూచుని కాగితాలు చూసు కుంటున్న జమీందారుగారికి హరికథ కన్న పిల్లల అల్లరి హెచ్చుగా వినవస్తున్నది. అందుచేత ఆయన ఒక నౌకరును పిలిచి, "ఆ పందిట్లో చేరినవాళ్ళకు అల్లరి చెయ్యక కథ వినమని చెప్పు," అని పంపాడు.

పనివాడు వెళ్ళి, "అల్లరి చెయ్యకండి, బాబో! అయ్యగారు కోప్పడుతున్నారు!" అని ఎంత అరిచినా ఎవడూ వినిపించుకో లేదు. అప్పుడు జమీందారుగారు భీమన్నతో, "అబ్బాయీ, నౌకర్లమాట వినేటట్టు లేరు, ఆ పందిట్లో మూకను నిశ్శబ్దంగా ఉండమని కేక వేసి రా!" అన్నాడు.

భీమన్న పందిట్లోకి వెళ్ళి, "అరవకండి! నిశ్శబ్దం! ఎవరన్నా నోరు మెదిపారంటే బయటికి విసిరేస్తాను!" అని రంకెలు పెట్టాడు. వెంటనే అంతా సద్దు మణిగింది.

ఇంతసేపటికి సభికులు ఒక దారికి వచ్చినందుకు సంతోషిస్తూ హరిదాసుగారు మేళ తాళాలతో ఒక పాట ఎత్తుకున్నాడు.

లోపలికి వెళ్ళి పోతున్న భీమన్న గిరుక్కున వెనక్కి తిరిగి, హరిదాసుతోనూ వాద్య బృందంతోనూ, "మీకు వేరే చెప్పాలా ఏమిటి? నిశ్శబ్దంగా ఉండమంటే మీకు కాదూ? చీమ చిటుక్కు మనటానికి వీల్లేదు, అంతే!" అన్నాడు.

హరిదాసుగారు కొయ్యబారిపోయాడు. ఆయన కేం చెయ్యాలో తెలియలేదు. కథ వినటానికి చేరినవారిలో పెద్దలకు కూడా అల్లుడుగారి ధోరణి అర్థం కాలేదు. వినే వాళ్ళను గప్‌చుప్‌గా ఉండమనటంలో అర్థం ఉన్నదిగాని, హరిదాసుగారినీ, వాద్యగాళ్ళనూ నిశ్శబ్దంగా ఉండమనటంలో అర్థమేమిటీ? అదృష్టవశాత్తూ అదే క్షణంలో బామ్మ బండి దిగి లోపలికి వచ్చింది.

"ఓహో, బామ్మ వచ్చిందే!" అన్నాడు భీమన్న పరమానందంతో. జమీందారుగారి నౌకర్లు బామ్మకు మర్యాదలు చేశారు.

మిగతా అతిథులకు భీమన్నపై కలిగిన అపోహ తొలగిపోయింది. బామ్మ వచ్చిందనే జమీందారుగారి అల్లుడుగారు హరికథ నిలుపు చేయించారు!

అంతేకాదు, హరిదాసుగారి అనుమానం కూడా తొలగిపోయింది. "ఆ వచ్చినవారు అల్లుడిగారి బామ్మగారా? ఇకనేం? వారి కోసం కథ మళ్ళీ ప్రారంభింతాం!" అన్నాడు హరిదాసుగారు.

బామ్మ లోపలికి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చి కూచోగానే హరికథ మళ్ళీ ప్రారంభమై, సవ్యంగా సాగిపోయింది.

(సమాప్తం)





# గుండ్రాయి మహిమ

ఒక ముసలిది చనిపోతూ తన ఇద్దరు మనవలనూ పిలిచి, "నాయనలారా, నాదగ్గిర వెండి బంగారాలు లేవు. వంట ఇంటో సన్ని కల్లూ, గుండ్రాయీ ఉన్నాయి. సన్నికల్లు పెద్దవాడూ, గుండ్రాయి చిన్నవాడూ తీసు కోండి. సుఖంగా కాలం గడపండి," అని చెప్పి ప్రాణాలు వదిలింది.

"సన్నికల్లు నా కెందుకూ? నేనేమన్నా వంటలు చేసుకు బతకాలా?" అనుకుని పెద్దవాడు మరొక గ్రామానికి వెళ్ళి, ఒళ్ళు వంచి పనిచేసి బాగుపడ్డాడు. చిన్నవాడు మటుకు, "ఈ గుండ్రాయి వల్ల ఏదో ఉప యోగం లేకపోతే అవ్వ దీన్ని నా కివ్వదు," అనుకుని, అస్తమానమూ దానిని తన వెంటే పెట్టుకు తిరిగాడు. వాడా గుండ్రా యిని వెంట బెట్టుకు తిరగటం చూసి ఊళ్ళో వాళ్ళంతా వెటకారం చేసేవాళ్ళు. వాడు రోజూ అడవిలో చితుకులు పోగుచేసి తెచ్చి, ఊళ్ళో వాళ్ళకమ్మి పొట్టపోసు కుంటూ ఉండేవాడు.

ఒకనాడు వాడు అడవిలో చితుకు లేరు తూండగా ఒక పెద్ద తోడేలు వాడి కేసి వచ్చింది. వాడు బెదిరిపోయి సమీపంలో ఉన్న చెట్టెక్కాడు.

తోడేలు తనతో మాట్లాడటం చూసి వాడికి ఆశ్చర్యం కలిగింది.

"భయపడకు, నేను నీ కేమీ హాని చేసేందుకు యిక్కడికి రాలేదు. నీ దగ్గిర ఉండే గుండ్రాయి ఒక్కసారి అరు వియ్యి, చాలు," అన్నది తోడేలు.

"దానితో నీ కేం పని?". అని వాడు తోడేలు నడిగాడు.

"నా జతతోడేలు ఇంతకుముందే చచ్చి పోయింది. నీ గుండ్రాయి ఒక్కసారి దాని ముక్కుల దగ్గిరపెడితే అది మళ్ళీ బతుకు తుంది," అన్నది తోడేలు.

బర్మా జానపద కథ

"నా గుండ్రాయికి అంత మహత్తున్నదా? నాకు తెలియదే?" అన్నాడు వాడు.

"నా వెంట వస్తే నీకే తెలుస్తుందిగా!" అన్నది తోడేలు.

వాడు చెట్టు దిగి తోడేలు వెంట బయలు దేరాడు. అడవిలో ఒక చోట చచ్చిన తోడేలున్నది. ముసలమ్మ మనవడు తన గుండ్రాయి తీసి ఆ తోడేలు ముక్కు దగ్గిర పెట్టాడు. వెంటనే దానికి మళ్ళీ ప్రాణం వచ్చింది.

"నీ గుండ్రాయి మహిమ అంతా దాని వాసనలో ఉన్నది. ఈ రహస్యం ఎవరికీ తెలియనంత కాలమూ దానికా మహిమ ఉంటుంది," అని మొదటి తోడేలు వాడికి చెప్పింది. తరవాత రెండు తోడేళ్ళూ తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

చిన్నవాడు తన గుండ్రాయితో సహా గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఒక కుక్క కళేబరం కనిపించింది. వాడు తన గుండ్రాయి తీసి చచ్చిన కుక్క ముక్కుల దగ్గిర ఉంచాడు.

కుక్కకు వెంటనే ప్రాణం వచ్చింది. అది లేచి నిలబడి తోక ఆడిస్తూ చిన్నవాడి వెంట బయలుదేరింది.

త్వరలోనే చిన్నవాడి ఖ్యాతి గ్రామ మంతా పాకింది. వాడు ప్రాణాలుకూడా



పోయగల ఘన వైద్యుడయాడు. అయితే ప్రాణాలిచ్చే శక్తి ఉన్నది వాడి గుండ్రా యిలో నన్న విషయం ఎవరికీ తెలియదు.

కొంతకాలానికి రాజుగారి ఏకైక సంతాన మైన కూతురు కాస్తా చనిపోయింది. చిన్న వాడు వెళ్ళి ఆమెను మళ్ళీ బతికించాడు. రాజుగారు కృతజ్ఞతతో తన కుమార్తెను వాడి కిచ్చి పెళ్ళి చేసి రాజ్యానికి వాణ్ణి వారసుణ్ణి చేశాడు. రాజుగారి అల్లుడై కూడా చిన్నవాడు చచ్చిపోయిన వారికి ప్రాణదానం చెయ్యటం మానలేదు. అందుచేత ఆ రాజ్యంలో ఎవరికీ చావు భయం అన్నది లేకుండాపోయింది.

ఒకరోజు చిన్నవాడి కొక ఆలోచన వచ్చింది: తన గుండ్రాయి వాసనతో పోయిన ప్రాణాలు రాగా లేందీ, వార్ధక్యం రాకుండా ఎందుకుండదు? ఇది నిజమో కాదో తేల్చుకుందామని వాడు రోజూ గుండ్రాయిని తాను వాసన చూస్తూ తన భార్యను కూడా వాసన చూడమన్నాడు. గుండ్రాయి వాసన చూడటం రాజ కుమార్తెకు అర్థం లేని పనిగా తోచింది. అయినా తన భర్త ఘన వైద్యుడు గనక, ఏదో ఉద్దేశంతో అలా చెప్పి ఉంటాడనుకుని తాను కూడా రోజూ గుండ్రాయిని వాసన చూస్తూ వచ్చింది.



దీని ఫలితంగా, వాడు ఊహించినట్టే, చిన్నవాడూ, వాడి భార్యా నిత్య యౌవనులుగా ఉండిపోయారు.

వారిని చూసి చంద్రుడు అసూయ పడ్డాడు. నిత్య యౌవన మనేది తనకు తప్ప మరెవరికీ ఉండరాదని చంద్రుడి ఉద్దేశం. అందుచేత చంద్రుడు చిన్నవాడి గుండ్రాయిని కాజెయ్యటానికి అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాడు చిన్నవాడు తన గుండ్రాయి కేసి చూసే సరికి అది పాచి పట్టి, వెలవెల పోతూ ఉండటం కనిపించింది. పాచి పోగొట్టటానికి వాడు దాన్ని ఎండలో ఉంచి, ఎవరూ ఎత్తుకు పోకుండా తానే కాపలా కూచున్నాడు.

ఇది చూసి రాజకుమార్తె, "కాబోయే రాజువుగదా, ఇదేం పని? గుండ్రాయికి నీవే కాపలా కాయాలా? ఎంతమంది భటులు లేరు?" అన్నది.

"నేను నా కుక్కను తప్ప ఇంకెవరినీ నమ్మలేను," అంటూ వాడు తన కుక్కను గుండ్రాయికి కాపలా పెట్టి తాను లోపలికి వెళ్ళిపోయాడు.

ఇదే సమయమనుకుని చంద్రుడు ఆ గుండ్రాయి ఉన్న చోటికి దిగి వచ్చి, గుండ్రాయి ఎత్తుకుని పారిపోసాగాడు. అమావాస్య చంద్రుడు కావటంచేత కుక్క అతణ్ణి చూడలేకపోయింది. అయితే గుండ్రాయి వాసన దానికి తెలుసు గనక ఆ వాసనను బట్టి తరుముకు వెళ్ళింది.

ఆ కుక్క ఇంకా చంద్రుణ్ణి తరుముతూనే ఉందంటారు బర్మావాళ్ళు. చంద్రగ్రహణం కలిగినప్పుడు, "అదుగో చంద్రుణ్ణి కుక్క మింగింది," అంటారు. గ్రహణం విడవగానే, "కుక్క చంద్రుణ్ణి కక్కింది," అంటారు. కుక్క చాలా చిన్నది కావటంచేత చంద్రుడు దానికి మింగుడు పడడని వారి అభిప్రాయం!






# రాకుమారి జులేకా

## 2

హసన్ తాను రాజభవనం వెలపలికి చేరుకున్నట్టు గ్రహించాడు. అప్పటికే కొంత పొద్దెక్కింది. హసన్ ముఖద్వారం వద్దకు వచ్చి పహరావాళ్ళకు కనబడేలాగా రాజభవనంలోకి ప్రవేశించాడు. అతను తిన్నగా వజీసు వద్దకు వెళ్ళాడు.

"ఏమైపోయావో అని ఎంత దిగులు పడ్డాను! ఎక్కడికి వెళ్ళావు, నాయనా?" అని వజీరు హసన్‌ను అడిగాడు.

"డమాస్కస్ వర్తకు డొకడు కనిపించాడు. అతను షీరాజ్ నుంచి బస్రాకు బయలుదేరుతున్నాడట. రాత్రికి తన అతిథిగా ఉండి పొమ్మని నిర్బంధించాడు," అని హసన్ బొంకాడు.

ఆ పగలల్లా, రాత్రి అంతా హసన్ కైరీయాను తలుచుకుంటూ ఆనందంగా గడిపాడు. మర్నాడు ఉదయం అంతఃపురం నుంచి ఒక కొజ్జావాడు వచ్చి అతని చేతి కొక ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆ ఉత్తరంలో ఎవరు రాసినదీ లేదుగాని, ఆ రాత్రికి ఉద్యానంలోకి రమ్మని ఆహ్వానం ఉన్నది. "చంద్రోదయ మయే సమయానికి చెట్ల మధ్యకు వస్తే నిన్ను ప్రేమించిన మనిషి నీతో ఒక విషయం మాట్లాడుతుంది," అని ఆ ఉత్తరంలో ఉన్నది. అంతదాకా హసన్‌కు కైరీయా తనను నిజంగా ప్రేమించిందన్న నమ్మకంలేదు. అంతఃపుర స్త్రీలు తనతో కాస్సేపు వినోదం పొందారని మాత్రమే అతను అనుకున్నాడు. ఈ ఉత్తరం చూచాక అతనికి తన అదృష్టం మీద విశ్వాసం పుట్టింది. అతను వజీరు దగ్గిరికి వెళ్ళి, "ఇవాళ రాత్రి మళ్ళీ నేను

సి. మాధవరావు



"లే, హసన్. మిగిలిన వారందరి కన్నా నేను నీకు నిజంగానే అందంగా కనిపించానా? నీ నోట ఆ మాట మళ్ళీ వింటే గాని నాకు నమ్మకం కలగదు," అన్నది కైరీయా, అతన్ని లేవదీస్తూ.

"నీవు నా పాలిటి దేవతవు. చూడు నీ కోసం ఈ అల్పమైన కానుక తెచ్చాను. దీనితోబాటు నా హృదయాన్నికూడా నీకు అర్పణ చేస్తున్నాను," అన్నాడు హసన్.

"నీ మాటలు విని సంతోషించాలో, విచారించాలో నాకు తెలియటంలేదు," అంటూ కైరీయా దీర్ఘంగా నిట్టూర్చింది.

"నీకి సంతోష సమయంలో విచారం దేనికి? మనకు రాబోయే అపద ఏమున్నదీ?" అని హసన్ ఆమెను అడిగాడు.

"రాకుమారి జులేకా రహస్యంగా నిన్ను ప్రేమిస్తున్నది. ఈ సంగతి నీతో చెప్పే అవకాశం కొరకు వేచి ఉన్నది. ఆమెకు ఏమి సమాధానం చెప్పకుంటావు? ఆమెను కాదని నన్ను ప్రేమించగలవా? ఆమె ద్వారా లభించే కీర్తి ప్రతిష్ఠలను కాలదన్నటం నీకు సాధ్యం అవుతుందా?" అన్నది కైరీయా విచారంగా.

"ఆ భయం నీకు వద్దు. నా హృదయంలో నీ కుండే స్థానాన్ని వెయ్యిమంది

బయటికి వెళ్ళాలి. అనుమతి ఇవ్వండి. మక్కా నుంచి వచ్చిన ఒక దర్వీషు స్నేహితుడు ఆహ్వానించాడు," అని చెప్పాడు. వజీరు సరే నన్నాడు. హసన్ ఇంటికి తిరిగి వచ్చాడు. తన వద్ద ఉన్న వివిధ రత్నాలలో ఉత్తమమైనవి ఏరి, వాటిని ఒక బంగారు తీగకు గుచ్చి హారం తయారు చేసి, ఒక చిన్న ద్వారం కుండా ఉద్యానంలోకి ప్రవేశించి, తాను పడుకుని నిద్ర పోయిన చోట తన ప్రియురాలి కోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

కొంతసేపైనాక కైరీయా వచ్చింది. హసన్ ఆమె ముందు మోకరించాడు.

రాజకుమార్తెలు కూడా అపహరించలేరు. నీపై గల ప్రేమను రుజువు చెయ్యటానికి ఎంత పెద్ద అపద వచ్చినా వెనకాడను. రాజుగారు సాబూర్ షా చచ్చిపోయి తన రాజ్యం జులేకాను పెళ్ళాడే వాడి కిచ్చినా నా మనసు మారదు," అన్నాడు హసన్.

"నేను జులేకాకు బానిస నన్న మాట మరిచిపోకు, హసన్. జులేకాకు ఆగ్రహం తెప్పించటం మన ఇద్దరికీ క్షేమం కాదు. ఆమె తలచుకుంటే మన ప్రాణాలు రాగి డబ్బు విలువ చెయ్యవు. అందుచేత మనం మన ప్రేమకు ఇన్ని కన్నీళ్ళు వదలటమే క్షేమం," అన్నది కైరీయా.

హసన్ ఈ మాటలు భరించలేకపోయాడు. "ఇటువంటి భయాలతో నన్ను వేధించకు. నీకు ఏమాత్రం ప్రమాదం కలుగుతుందని తోచినా నా వెంట వచ్చెయ్యి. మా దేశానికి పారిపోయి ఏ నిర్జనమైన లోయలోనో కాపరం పెడదాం. నేను బీదవాణ్ణి కాను. మనం బతికినన్నాళ్ళూ మహారాజుల్లాగా బతకటానికి తగినంత ధనం నా వద్ద ఉన్నది," అన్నాడతను.

కైరీయా ఈ మాటతో సంతృప్తి పడి, "హసన్, నీ ప్రేమలో నా కిప్పటికి విశ్వాసం కలిగింది. ఇంక నిన్ను మోసం చెయ్య




లేను. నేను కైరీయాను కాను, రాజకుమార్తె జులేకాను. జులేకా అని చెప్పుకుంటున్నది నా ఇష్టసఖి కైరీయా. ఆమెను పిలుస్తా నుండు," అంటూ సన్నగా ఈల వేసింది. ఈ ఈల వినగానే జులేకాలాగా నటిస్తున్న కైరీయా వచ్చి జులేకాకు వందనం చేసింది.

జులేకా హసన్ కేసి తిరిగి, "ఇన్నాళ్ళూ నేను ఆడిన నాటకం గురించి అపోహ పడకు, హసన్. ఆ రాత్రి వెన్నెలలో చెట్టు కింద నిద్రపోతున్న నిన్ను చూసిన క్షణం లోనే నా హృదయం చలించింది. నిన్ను ప్రేమించాను," అన్నది.




ఆ ముగ్గురూ ఆ రాత్రి కబుర్లతో గడిపి తెల్లవారుజామున ఎవరిదారిన వారు వెళ్ళి పోయారు. హసన్ మనసు మనసులో లేదు. అతను రెండు రోజుల అనంతరం పగటివేళ ఉద్యానం కేసి వెళ్ళేసరికి అక్కడ చెట్టు కొక సిపాయీ, పుట్ట కొక సిపాయీ కనిపించాడు. గుండె గుభేలు మని హసన్ ఇంటికి తిరిగి వచ్చాడు. అక్కడ ఒక కొజ్జావాడు అతని కోసం వేచి ఉండి, అతన్ని చూడగానే చేతిలో ఒక చీటీ పెట్టి, ఎవరో తరుము కొస్తున్నట్టుగా పారిపోయాడు.

ఆ చీటీలో కూడా సంతకం లేదు, కాని అది జులేకా నుంచే వచ్చినట్టు హసన్ గ్రహించాడు. తన వెంట వేటగాళ్ళు పడ్డారనీ, ఇంక తాము కలుసుకునే అవకాశం ఉండ దనీ, హసన్ తొందరపడి తమ రహస్యం బయటపెట్టగూడదనీ, ఎంత దుర్వార్త విన వచ్చినా సరే అతను నిబ్బరంగా ఉండాలనీ జులేకా అతన్ని హెచ్చరించింది.

ఈ ఉత్తరం చూడగానే అతనికేదో గుబులు పుట్టుకొచ్చింది. మర్నాడు ఉద యానికే రాకుమారి జులేకా మరణిం చిందన్న వార్త కార్చిచ్చులాగా దివాణ మంతటా వ్యాపించింది.

ఈ వార్త వినగానే హసన్ కళ్ళు చీకట్లు కమ్మాయి. అతను స్పృహ తప్పి వజీరుగారి చేతుల్లో మూర్ఛ పోయాడు.

వజీరు వారం రోజులపాటు పరిచర్యలు చేయించిన మీదట హసన్ కోలుకున్నాడు. కాని అతనికి జీవితం మీద ఇచ్ఛ లేకుండా పోయింది. దివాణం మీద రోత పుట్టింది. అవకాశం చూసుకుని ఏ ఎడారిలోకో ఒంటరిగా పారిపోవాలనిపించింది.

చీకటి పడగానే హసన్ తన రత్నా లన్నీ తీసుకుని, ఆ నాడు చెట్టుకు ఉరి పోసు కున్నప్పుడే ప్రాణాలు వదిలితే బాగుండే దనుకుంటూ, చల్లగా షీరాజ్‌నగరం నుంచి బయటపడి ఎడారి కేసి ప్రయాణ

మయాడు. అతను ముక్కు సూటిగా ఆ రాత్రంతా నడిచాడు, మర్నాడు పగలల్లా నడిచి సాయంకాలానికి చిన్న నీటి గుంట ఉన్న చోటికి చేరాడు.

అంతలోనే వెనక నుంచి గుర్రపు డెక్కల ధ్వని వినవచ్చింది. హసన్ పడమరగా చూసేసరికి ఒక యువకుడు గుర్ర మెక్కి వస్తూ కనిపించాడు. అస్తమయ సూర్య కాంతిలో అతనొక రాజకుమారుడు లాగున్నాడు. హసన్ చేసిన అభివాదానిక తను చెయ్యెత్తి సలాము చెయ్యటం తప్ప నోటితో ఏమీ అనకపోవటం చూసి ఆ యువ కుడు ముసల్మాను కాడని తోచి, హసన్‌కు విచారం కలిగింది.

"కాస్త చల్ల గాలి తిరిగింది. ఇక్కడ చల్లని మంచి నీరున్నది. తమకు బడలిక తీరుతుందనుకుంటాను," అని హసన్ ఆ యువకుణ్ణి పలకరించాడు. ఆ యువకుడు నవ్వుతూ గుర్రం దిగి, గుర్రాన్ని నీటి మడుగు సమీపంలో కట్టేసి, హసన్ వద్దకు వచ్చి, ఆకస్మికంగా అతన్ని ఆలింగనం చేసుకున్నాడు. ఆ యువకుడు జులేకాయే అని అప్పటికిగాని హసన్ గుర్తించలేదు.

జరిగినదంతా జులేకా అతనికి చెప్పింది. ఆమె కైరీయా సహాయంతో చనిపోయినట్టు నటించింది. హసన్ షీరాజ్ నగరాన్ని వదిలిన దాకా అజ్ఞాతంగా ఉండి, తరవాత మారు వేషంలో అతన్ని అనుసరించి వచ్చింది. ఆమె హసన్ కోసం తన తండ్రినీ, రాజ్యాన్నీ, సమస్త భోగాలనూ విడిచి వచ్చింది!

ఆ రాత్రి వారు ఆ నీటి గుంట వద్దనే విశ్రమించి, మర్నాడు ఉదయం జులేకా ఎక్కి వచ్చిన గుర్రం మీద ఇద్దరూ ఎక్కి కాలక్రమాన డమాస్కస్ చేరుకున్నారు. అక్కడ ఉంటూండగానే హసన్ అక్కడి ఖలీఫా ప్రాపకం సంపాదించి, వజీరుగా నియమించబడి, గొప్ప జ్ఞాని అని కీర్తి గడించాడు.





# గుర్రానికి కిరాయి

ఒక గ్రామంలో ఇద్దరు కాపు లుండేవారు. వారిద్దరిని గురించి ఆ ప్రాంతంలో ఎరగని వారు లేరు. వారిలో ఒకడు అమిత సాధువు, మందబుద్ధి కలవాడు కూడా.

రెండోవాడు జిత్తులమారి, చురుకైనవాడు. వాడు ఎంత తెలివిగల వాడంటే, 'వాడి చేత ఒకసారి మోసపోయిన వాళ్ళే మళ్ళీ మళ్ళీ మోస పోతూండేవారు.

మందబుద్ధి చాలా పేదవాడు. వాడికి బండి లేదు సరేకదా, ఒక కంచరగాడిద అయినా లేదు. ఒకసారి వాడు తాను పండించిన పెండలాన్ని బస్తీకి తీసుకు పోయేందుకు తన స్నేహితుడైన మరొక కాపు వద్దకు వెళ్ళి, "రేపు నీ కంచర గాడిదను అరువిస్తావా?" అని అడిగాడు.

"నా కంచరగాడిద నిన్న మధ్యాన్న మనగా ఎటో పోయింది. ఇంతవరకు దాని జాడ లేదు," అన్నాడు స్నేహితుడు.

"ఇప్పుడేం చేసేటట్టు? రేపు నా పెండ లాన్ని బస్తీకి తీసుకు పోదామనుకున్నాను," అన్నాడు మందబుద్ధి.

గ్రామం అవతలి చివర మరొకడున్నాడు. వాడు పెద్ద లోభి. వాడి దగ్గిర ఒక గుర్రం ఉన్నది. దాన్ని అరువు తెచ్చుకోమని స్నేహితుడు మందబుద్ధికి సలహా ఇచ్చాడు.

మందబుద్ధి సరేనని లోభివాడి దగ్గిరికి వెళ్ళి, "రేపు నీ గుర్రాన్ని అరువిస్తావా?" అని అడిగాడు.

లోభివాడు ఆలోచించి, "గుర్రాన్ని ఇస్తే కిరాయి ఏమిస్తావు?" అని అడిగాడు.

"నా దగ్గిర చిల్లి గవ్వ లేదు. ఒక్క రోజు పని గనక ఊరికేనే ఇస్తావేమో ననుకున్నాను," అన్నాడు మందబుద్ధి.

"అదంతా వీలు పడదు. నా గుర్రం కిరాయి రోజుకు పదిహేను గుమ్మడి కాయలు," అన్నాడు లోభి.

ఆర్. నాగేశ్వరరావు



"నా దగ్గిర ప్రస్తుతం అయిదు గుమ్మడి కాయలే ఉన్నాయి. మిగిలిన పదీ కొన్నాళ్ళయితేగాని ఇచ్చుకోలేను," అన్నాడు మందమతి.

"ఇప్పుడున్న అయిదూ ఇచ్చెయ్యి. మిగిలిన పదీ ఇచ్చినాక గుర్రాన్ని తీసుకు పో," అన్నాడు లోభి.

మందమతి సరేనని ఇంటికిపోయి తన వద్ద వున్న అయిదు గుమ్మడికాయలూ లోభికి తెచ్చి యిచ్చాడు.

మర్నాడు తెల్లవారుతూనే స్నేహితుడు తన కంచరగాడిదను మందమతి దగ్గిరికి తెచ్చి, "ఇదుగో, నా కంచరగాడిద. అర్ధ రాత్రివేళ తిరిగి వచ్చింది. నీ సరుకు దీని మీద వేసి బస్తీకి చేర్చుకో," అన్నాడు.

"నేనా లోభివాడి గుర్రాన్ని మాట్లాడు కున్నాను," అన్నాడు మందమతి.

"నా గాడిద దొరికింది గద, ఇంక వాడి గుర్రంతో ఏం పని?" అన్నాడు స్నేహితుడు.

"వాడికి అయిదు గుమ్మడికాయలు బయానా కూడా ఇచ్చుకున్నాను. ఇప్పుడు నాకు గుర్రం వద్దంటే ఆ గుమ్మడికాయలు తిరిగి ఇవ్వడు," అన్నాడు మందమతి.

"చిక్కే వచ్చిందే! ఏమిటి ఉపాయం?" అన్నాడు స్నేహితుడు.

సరిగా ఆ సమయంలోనే జిత్తులమారి అక్కడికి వచ్చాడు. సంగతంతా తెలుసు కుని, "గుర్రం అక్కర్లేదని చెప్పి నీ గుమ్మడికాయలు నువు తెచ్చుకో. ఆ లోభి వెధవకు భయపడతావేమిటి?" అన్నాడు.

"నాకు వాడంటే భయమే," అన్నాడు మందమతి.

"అయితే నా వెంటరా. గుమ్మడికాయ లెందుకివ్వడో చూస్తాం," అంటూ జిత్తుల మారి వాడు మందబుద్ధిని అక్కణ్ణుంచి బయలుదేర దీశాడు.

ఏంజరుగుతుందో చూద్దామని స్నేహితుడు కూడా వారి వెనకే వెళ్ళాడు.

వాళ్ళను చూసి లోభివాడు, "ఏం వచ్చారు?" అని అడిగాడు.

"గుర్రం కోసమే, ఏదీ నీ గుర్రం?" అన్నాడు జిత్తులమారి.

"అదుగో, ఆ కనిపించేదే. అయితే మటుకు, మిగిలిన పది గుమ్మడికాయలూ ఇవ్వందే గుర్రాన్నివ్వను," అన్నాడు లోభి.

"అంత తొందరపడతావేం? గుర్రం చాలుతుందో లేదో ముందు చూడనీ!" అన్నాడు జిత్తులమారి.

"చాలట మేమిటి? గుర్రమన్న తరవాత గుర్రమే. గుర్రానికి చాలటమూ, చాలక పోవటమూ ఉంటుందా?" అన్నాడు లోభి.

"అంతేనా నీకు తెలిసింది? ఇప్పుడు కొలిచి చూస్తాంగద!" అంటూ జిత్తులమారి వాడు గుర్రం వీపును తన జానతో కొలప నారంభించి, మందమతితో, "ఎంతలేదన్నా నీకు రెండు జానల చోటు కావాలి. నిన్ను మధ్య కూచోబెడతా మనుకుందాం. నాకు జానా బెత్తా చాలు, నీ వెనక కూచుంటానను కుందాం. నా భార్య నా వెనక కూచోవచ్చు. దానికీ రెండు జానలు కావాలి. నీ భార్యకు కనీసం రెండు జానలపైన ఒక బెత్తెడు చోటు కావాలి. ఆవిణ్ణి ముందు కూచో బెడతాం. పోతే పిల్లలకు చోటు చూడాలి.



నీ కూతురు చిన్నదే గనక గుర్రం మెడమీద కూచోవచ్చు. చిన్నవాడు దాని ఒళ్ళో కూచుంటాడు..." అంటూ చెప్పుకు పోసాగాడు.

లోభివాడి కీ మాటలు వింటుంటే దడ పుట్టుకొచ్చింది. "ఆగండి! మీ కేమన్నా మతులు పోయాయా ఏం? గుర్రం అంతమందిని మోస్తుందా ఎక్కడన్నా?" అన్నాడతను.

"ఆ సంగతి గుర్రం చూసుకుంటుంది. అది దాని సమస్య. మా సమస్య అందరమూ ఈ గుర్రం మీద తీర్థానికి వెళ్ళ గలమా అని!" అన్నాడు జిత్తులమారి.

"అయితే, మీరంతా నా గుర్రం మీద ఎక్కి తీర్థానికి పోతారూ?" అన్నాడు లోభి.

"కొంచెం ఇరుకవుతుందన్న మాటేగాని గుర్రం మీద చోటున్నది!" అన్నాడు జిత్తులమారి.

"ఇంకా నయం! నేనసలు మీకు గుర్రాన్ని కిరాయికివ్వను," అన్నాడు లోభి.

"మాట అనుకున్నాక వెనక్కు పోగూడదు. అది పెద్దమనిషి లక్షణం కాదు. ...అన్నట్టు, మీ అమ్మ మాటే మరిచాం! ఆవిణ్ణి ఎక్కడ కూచోబెట్టేటట్టు? కోళ్ళకూ, మేకలకూ చోటేది?" అన్నాడు జిత్తులమారి నిస్పృహ అభినయిస్తూ.

లోభికి వెర్రెత్తిపోయింది. వాడు గట్టిగా అరుస్తూ, "నా గుర్రాన్ని చంపుతారా ఏం? నేను మీకు గుర్రాన్ని ఇవ్వను," అన్నాడు.

"అనుకున్న బేరం వెనక్కు లాగావంటే నిన్ను న్యాయస్థానానికి ఈడుస్తాను, ఏమను కున్నావో!" అన్నాడు జిత్తులమారి.

"మీ అయిదు గుమ్మడికాయలూ మీరు పట్టుకుపొండి. నాకీ బేరం వద్దనే వద్దు," అన్నాడు లోభి.

"మాట్లాడుకున్నది పదిహేను గుమ్మడి కాయలైతే అయిదు గుమ్మడికాయలంటా వేమిటి? మోసం!" అన్నాడు జిత్తులమారి.

"నాకు మీ రిచ్చింది అయిదు గుమ్మడి కాయలేగద," అన్నాడు లోభి.

"అయిదు గుమ్మడికాయలకు నువు గుర్రాన్నిచ్చావా ఏం? పదిహేను గుమ్మడి కాయలూ ఇస్తేనేగాని గుర్రాన్ని కిరాయి కివ్వ నంటివిగా? బేరం మానుకో దలుచుకుంటే పదిహేను గుమ్మడికాయలూ నువ్విచ్చుకోక తప్పేదేముందీ?" అన్నాడు జిత్తులమారి.

లోభి ఇంట్లోకి పరిగెత్తి పదిహేను గుమ్మడి కాయలు తెచ్చి, "వీటిని తీసుకుని పొండి. మీకూ, మీ బేరానికీ ఒక దణ్ణం!" అన్నాడు.

వాటిని తీసుకుని ముగ్గురూ తమ ఇళ్లకు బయలుదేరారు.





# రాజద్రోహులు

పూర్వం ఒక రాజుండేవాడు. ఆ రాజంటే ప్రజలకు చాలా ఇష్టం. దానికి కారణ మేమంటే ఆయన ప్రజల కష్టసుఖాలను వెయ్యి కళ్ళతో కనిపెట్టేవాడు, ప్రజలు చేసుకునే విన్నపాలను శ్రద్ధగా విని, వారికి న్యాయం చేసేవాడు. అయితే ప్రజలు అబద్ధాలు చెప్పి ఆయనను మోసగించటం అసాధ్యంగా ఉండేది. తన రాజ్యంలో ఏ మూల ఏది జరిగినదీ, ఎవరు ఏమేమి అనుకున్నదీ ఆయన స్వయంగా చూసి నట్టూ, విన్నట్టూ కనిపించేవాడు.

దీనికి కారణం లేకపోలేదు. ఆయన మధ్యాన్నం దాకా సభ చేసి, మరి ఆ రోజల్లా ఎవరికీ దర్శన మిచ్చేవాడు కాడు. ఆయన తన మంత్రితో సహా మారు వేషం ధరించి, ఒక రహస్య ద్వారం కుండా నగరపు వీధులలోకి వచ్చి, సందులూ గొందులూ కలయతిరిగే వాడు.

ఒకరోజు రాజూ, మంత్రీ మారు వేషాలలో నగరం పర్యటించి రాజభవనానికి తిరిగి వస్తూండగా, ఒక వీధి వర్తకుడు వారిని ఆపి రాజుకు ఒక నగల బరిణలాటిది చూపాడు. అదేమిటని రాజు అడిగాడు.

"సువాసన పొడి, మహారాజా!" అన్నాడు వర్తకుడు.

తనను వాడు గుర్తించి నందుకు రాజు చకితుడయాడు; అయినా పైకి ఆశ్చర్యం తెలియనివ్వక, "దీని వెల ఎంత ?" అని అడిగాడు.

"ఒక బంగారు కాసు విలువ చేస్తుంది," అన్నాడు వీధి వర్తకుడు.

రాజు వాడి చేతిలో రెండు బంగారు కాసులు పెట్టి ముందుకు సాగాడు. ఆయనా మంత్రీ వెంటనే రాజభవనానికి తిరిగి వెళ్ళక, సాయంశోభ ఆనందించటానికి నగరం బయట ఉన్న సరస్సు వద్దకు

ఎస్. శాంతకుమారి



నడిచారు. అక్కడ రాజు బరిణను తెరిచాడు. అందులో ఒక చిన్న కాగితం పై ఇలా రాసి ఉన్నది:

"దీన్ని వాసన చూస్తే రెక్కలు వస్తాయి,
'క్సలవేర్' అంటే చేతులు వస్తాయి."

రాజు మంత్రితో, "చూశావా, ఇది మామూలు సువాసన పొడి కాదు, మంత్రపు పొడి. దీన్ని పీల్చితే మనం పక్షుల మవుతాం. 'క్సలవేర్' అనగానే మళ్ళీ మనుష్యుల మవుతాం. కొంచెం పీల్చి చూతామా?" అన్నాడు.

రాజూ, మంత్రీ చెరొక చిటికెడు పొడీ వేళ్ళతో తీసుకుని, బరిణెను ఒక చోట భద్రంగా ఉంచి, పొడిని అఘ్రాణించి—కొంగలుగా మారిపోయారు!

వారు సరస్సు అవతలి గట్టుదాకా ఎగిరి వెళ్ళి, తరవాత నగరం మీద, ఇళ్ళ కప్పులకు పైగా ఎగిరారు.

చీకటి పడింది. రాజూ మంత్రీ తమ యథా రూపాలు పొందటానికి నిశ్చయించుకుని, "క్సలవేర్," అన్నారు. కాని వారి రూపాలు మారలేదు. పక్షి రూపాలు పోగొట్టుకోవటానికి ఎంతో యత్నించి, ప్రాణంవిసిగి, వారిద్దరూ సరస్సు ఒడ్డున ఆ రాత్రి నిద్ర పోవటానికి నిశ్చయించుకున్నారు.

మర్నాడు తెల్లవారుతూనే ఇద్దరూ నిద్ర లేచి, నీటిలోని చేపలను తిని కడుపునించుకుని, రెక్కలను ముక్కులతో దువ్వుకుని రాజభవనం కేసి ఎగిరి వెళ్ళి, ఒక కప్పు మీద వాలారు.

రాజూ, మంత్రీ కనిపించటం లేదని అధికార్లు కలవర పడటం వారి కళ్ళపడింది. "మీరు వెతికేది మా కోసమే," అని వారు చెప్ప యత్నించారు. కాని ఆ కొంగ భాష ఎవరికీ అర్థంకాలేదు. చేసేదిలేక వారిద్దరూ సరస్సు వద్దకు ఎగిరిపోయారు.

రాజుగారు కనబడటం లేదన్న వార్త రాజభవనం నుంచి నగరానికి పాకింది.

ప్రజలు హాహాకారాలు చేశారు. వాళ్ళ ఆర్త నాదాలు విని రాజూ, మంత్రీ ఎంతో దుఃఖించి, ప్రజలను ఊరడించటానికి అరుస్తూ నగరమంతటా ఎగిరారు. ప్రజలు వారిని చూసి, "రాజుగారి కోసం చివరకు కొంగలు కూడా ఆక్రందన చేస్తున్నాయి!" అన్నారు, కాని నిజం తెలుసుకోలేకపోయారు.

ఒకనాటి ఉదయం వారు నగరం మీద ఎగురు తూండగా ఒక ఊరేగింపు రాజవీధి వెంట వస్తూ కనిపించింది. ఆ ఊరేగింపులో రాజదుస్తులు ధరించి ఒక యువకుడు ఉన్నాడు. వాడికి రాజలాంఛనాలన్నీ ఉన్నాయి. ఊరేగింపు వెంట నడిచే పౌరులు, "మహారాజుకు జై!" అని పెద్దగా కేకలు పెడుతున్నారు.

నగరానికి కొత్తగా రాజైనవాడు సేనాపతి కొడుకు. వాడు పరమ దుర్మార్గుడు. "వీడు రాజైతే నా ప్రజలకు సుఖమనేది ఉండదు," అన్నాడు రాజు మంత్రితో.

ఆ రోజే సేనాపతి కొడుక్కు రాజ్యాభిషేకం జరిగింది. ఆ తంతు కళ్ళారా చూసి రాజూ, మంత్రీ విచారంగా సరస్సువద్దకు తిరిగి వెళ్ళిపోయారు.

"ఇప్పుడంతా తెలిసిపోయింది. మనని ఇలా చేసినది సేనాపతే!" అన్నాడు రాజు




మంత్రితో. ఆ క్షణమే వారిద్దరూ కూడ బలుక్కుని సరస్సు అవతలి తీరాన అరణ్యంలో నివాసం ఏర్పరచుకోవటానికి నిశ్చయించుకుని, నిర్జనమైన ఆ అరణ్యానికి ఎగిరిపోయారు.

వారాలూ, నెలలూ గడిచాయి. రాజూ, మంత్రీ తమ కొంగ జీవితాలను అరణ్యంలోని మడుగుల వద్ద గడిపేస్తున్నారు. వారు కప్పలనూ, చేపలనూ వేటాడుతూండగా వారి కొక వింత దృశ్యం కనిపించింది. ఒక వడ్రంగిపిట్ట పురుగుల కోసం ఒక చెట్టు బోదెను ముక్కుతో కొట్టుతూ మధ్యమధ్య కన్నీరు కారుస్తున్నది.




రాజు కాస్సేపు ఈ వింత గమనించి, "ఓ వడ్రంగిపిట్టా, నీకు మా భాష తెలుస్తున్నదా?" అని అడిగాడు.

"తెలుస్తున్నది," అన్నది వడ్రంగిపిట్ట, కొంగల కేసి వింతగా చూసి.

"అయితే చెప్పు, ఎందు కలా కన్నీరు కారుస్తున్నావు?" అని రాజు అడిగాడు.

"మీరు జన్మతహా పక్షులు, నా బాధ మీ కెలా అర్థమవుతుంది? నేను ఒకప్పుడు మనిషినై ఉండి ఈ పిట్టరూపు ధరించవలసి వచ్చింది," అన్నది వడ్రంగిపిట్ట.

"నీ కథ అంతా చెప్పు, మేము అర్థం చేసుకోగలం," అన్నాడు రాజు.

"ఈ సరస్సు అవతల ఉండే నగరాన్ని పాలించే సేనాపతి నన్నిలా చేశాడు. నేను ఈ పొరుగు రాజు కుమార్తెను. మా తండ్రి అనంతరం రాణి కావలిసిన దాన్ని. తన కొడుకును పెళ్ళాడమని సేనాపతి నన్ను కోరాడు. ఆ నీచుణ్ణి పెళ్ళాడ నిరాకరించాను. అందుచేత మంత్రప్రయోగం చేయించి నన్ను వడ్రంగి పిట్టగా మార్చాడు. నన్ను ఒక మనిషి భార్య కమ్మని అడిగి, అందుకు నేను సమ్మతించి నప్పుడు నాకు మనిషి రూపు వస్తుందని వాడన్నాడు. నాకీ వడ్రంగిపిట్ట జీవితంపై రోతపుట్టి మనిషి కావాలన్న కోరిక బలంగా కలిగినప్పుడు వాడు తన కొడుకును పంపిస్తాడనుకుంటాను. ఈలోపుగా నాకు మనిషికావాలని పించేటట్టు చేయటానికి ప్రతి రాత్రీ ఎవరో ముగ్గురు మనుషులు వచ్చి, నా ప్రజలను తాము ఎన్నెన్నిపాట్లు పెడుతున్నదీ నేను వినేలాగా మాట్లాడుకుంటారు. వారి మాటలు నాకు కర్ణశల్యాలలాగా ఉంటున్నాయి. అవి తలుచు కున్నప్పుడల్లా నాకు ఆగకుండా దుఃఖం వచ్చేస్తుంది," అని వడ్రంగిపిట్ట చెప్పింది.

"నువు చెప్పే ముగ్గురు మనుషులూ ప్రతి రాత్రీ ఎక్కడ కలుస్తారు?" అని రాజు

అడిగాడు. వడ్రంగిపిట్ట కొంగలకు అరణ్యం మధ్య ఒక చిన్న ఖాళీ స్థలం చూపింది.

ఆ సాయంకాలం చీకటి పడబోయే సమయానికి రాజూ, మంత్రీ ఎగిరి వెళ్ళి ఆ ఖాళీ స్థలం చుట్టూ ఉండే పొదలలో దాక్కున్నారు. ఆ మనుషులు మాట్లాడుకునేది తమకు ఏవిధంగానైనా లాభించవచ్చునని రాజు ఆశ. చీకటిపడ్డాక ముగ్గురు మనుషులు అక్కడికి వచ్చారు. వారు వచ్చిన కాస్సేపటికి మరి ఇద్దరు వచ్చారు. వెనకగా వచ్చిన మరి యిద్దరూ ఎవరో కాదు, సేనాపతీ వాడి కొడుకైన కొత్త రాజూనూ.



మొదట వచ్చిన ముగ్గురూ, "మహా రాజులవారికి జయం! తమ పరిపాలన ఎలా సాగుతోంది? ప్రజలేమంటున్నారు?" అని అడిగారు.

"మొదట్లో నన్ను చూసి సంతోషం కనబరిచారు గాని, క్రమంగా అది తగ్గిపోయింది. వాళ్ళు తమ పాత రాజును ఇంకా మరిచిపోయినట్టు లేదు," అన్నాడు సేనాపతి కొడుకు.

"వాళ్ళు మూర్ఖులు. వాళ్ళకు పాత రాజు మరి దక్కడు. నేను అందుకు తగిన యుక్తే చేశాను," అన్నాడు ముగ్గురిలో ఒకడు. వాడే రాజుకు సువాసన పొడి అమ్మిన వాడు. వాడూ, వాడి వెంట ఉన్న మరి ఇద్దరూ కూడా మంత్రగాళ్ళే.

"ఔనౌను! రాజునూ, మంత్రినీ రూపు లేకుండా మాయం ఎలా చేశావో కాస్త మాకు కూడా చెబుదూ?" అన్నారు మిగిలిన ఇద్దరు మాంత్రికులు.

"నేను వీధి వర్తకుడి వేషం వేసుకుని రాజుకూ, మంత్రికీ మంత్ర భస్మం అమ్మాను. అది పీలిస్తే పక్షులైపోతారు. ఆ పొడి ఉన్న డబ్బీలో దాని ఉపయోగం రాసిన చీటీ ఉంచాను. 'క్జలవేర్' అన్నట్టయితే పక్షులైనవారికి నిజరూపు వచ్చేస్తుంది. కాని నేను చిన్న మార్పు చేసి 'క్జలవేర్'

అనటానికి బదులు 'క్సలవేర్' అనాలని అందులో రాశాను. వాళ్ళు నోళ్ళు పడి పోయినదాకా 'క్సలవేర్' అననీగాక, వారి రూపు మారదు. ఆ కొద్ది మార్పు చెయ్యాలని వారికి చచ్చినా తెలీదు," అన్నాడు మొదటి మాంత్రికుడు. ఇది విని మిగిలిన వాళ్ళు కడుపు చెక్కలయేట్టు నవ్వారు.

రాజూ, మంత్రీ ఈ మాటలు విని, తమ రహస్య ప్రదేశం నుంచి మెల్లిగా అవతలికి వెళ్ళి, అక్కడి నుంచి వడ్రంగి పిట్ట ఉండే చోటికి ఎగిరి వెళ్ళారు. ఆ పిట్ట ఇంకా చెట్ల బోదెలను కొడుతూనే ఉంది.

రాజూ మంత్రీ, "క్షలవేర్," అనగానే వారికి మామూలు రూపాలు వచ్చేశాయి. రాజు వడ్రంగి పిట్టను సమీపించి, "నన్ను పెళ్ళాడతావా? నీకు సమ్మతమైతే—" అని మాట పూర్తి చేసే లోపునే వడ్రంగి పిట్ట మాయమై ఒక చక్కని రాజకుమార్తె వారి ఎదట ప్రత్యక్షమయింది.

వారు ముగ్గురూ ఆ చీకటిలోనే ప్రయాణించి, సూర్యోదయం వేళకు నగర ద్వారం ప్రవేశించారు. ద్వార పాలకులు మొదలు కొని ప్రతి ఒక్కరూ తమ రాజును గుర్తించారు. "రాజుగారు తిరిగి వచ్చారు!" అన్న వార్త అంచెల మీద నగర మంతటా వ్యాపించింది. ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి రాజుకూ, మంత్రికీ, వారి వెంట ఉండే పొరుగుదేశపు రాణికీ స్వాగతం చెప్పారు. నగరమంతా గుడి గంటలతోనూ, మంగళ వాద్యాలతోనూ మార్మోగింది.

తరవాత సేనాపతీ, కొడుకూ నగరంలోకి వస్తూనే రాజభటులకు బందీలుగా చిక్కిపోయారు. ఇద్దరికీ సంకెళ్ళు వేసి కారాగృహంలో పడేశారు.

రాజుకూ పొరుగు రాణికీ వైభవంగా వివాహం జరిగింది. ఆ సందర్భంలో ఒక బ్రహ్మాండమైన విందు జరిగింది. అందులో నగరంలోని పౌరులందరూ పాల్గొన్నారు.





# కిష్కింధా కాండ

వానరులు తిరిగి తిరిగి అలిసిపోయి, ఆకలి దప్పులతో అలమటిస్తూ, మయుడు నిర్మించిన ఋక్షబిలం వద్దకు చేరుకున్నారు. అందులోనుంచి పక్షులు ఎగిరి వస్తున్నాయి, సువాసనలు వెలువడుతున్నాయి. కాని బిలానికి అడ్డంగా లతల పొదలు ఉండటం చేత లోపలికి వెళ్ళటం కష్టంగా ఉన్నది.

"ఈ బిలం లోపలినుంచి పక్షులు రావటం చూస్తేనూ, బయట ఉన్న పొదలు నవనవలాడుతూ ఉండటం చూస్తేనూ దీని లోపల బావో, చెరువో ఉంటుందని తోస్తుంది," అన్నాడు హనుమంతుడు.

వెంటనే వానరులు ఆ బిలం లోపలికి ప్రవేశించారు. లోపల గాఢాంధకారం. ఆ కటిక చీకటిలో వారు ఒకరి చేతు లొకరు పట్టుకుని ముందుకు పోగా పోగా ఒక అద్భుతమైన ప్రదేశం వచ్చింది. ఆ ప్రదేశం, కాంతివంతంగా ఉన్నది. పెద్ద పెద్ద చెట్లున్నాయి. వెండి బంగారాలతో చేసి రత్నాలతో అలంకరించిన ఇళ్ళున్నాయి. బంగారు, వెండి, కంచు పాత్రలు రాసులుగా పోసి ఉన్నాయి. అలాగే అగరు చందనాలూ, ఫలాలూ, పానీయాలూ, బట్టలూ, రత్న కంబళ్ళూ, తోళ్ళూ, బంగారమూ పెద్ద పెద్ద రాసులలో కనిపించాయి.

దగ్గిరలోనే ఒక స్త్రీ కృష్ణాజినమూ, నార బట్టలూ ధరించి, కాంతితో వెలిగిపోతూ తపస్సు చేసుకుంటున్నది.



హనుమంతుడామెను సమీపించి నమస్కరించి, "నీ వెవరు? ఇదేమి బిలం? మేము చాలా దూరం ప్రయాణించి, ఆకలి దప్పులతో అలమటిస్తూ నీరు దొరుకుతుందనే ఆశతో తొందరపడి ఈ బిలం ప్రవేశించాం. ఇక్కడి వింతలన్నీ చూస్తే ఇదంతా రాక్షసమాయేమో ననిపిస్తున్నది. ఈ ఇళ్ళూ, ఈ పళ్ళూ ఎవరివి? ఇక్కడి నీళ్ళలో బంగారు కమలాలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఎవరి మహిమ చేత కలిగాయి?" అని అడిగాడు.

దానికి ఆ తపస్విని ఈ విధంగా సమాధానం చెప్పింది :

"దానవుల విశ్వకర్మ అయిన మయుడు ఇక్కడ నివసించేవాడు. ఆయన దీర్ఘ తపస్సు చేసి బ్రహ్మ నుంచి గొప్ప వరాలు పొందాడు. ఆయనే తన శక్తిచేత ఈ ప్రదేశం సృష్టించి, హేమ అనే అప్సరతో ఇక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చాడు. అది చూసి సహించలేక దేవేంద్రుడు మయుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశం హేమ కిచ్చేశాడు. హేమ నా ఇష్ట సఖి. నేను మేరుసావర్ణి కుమార్తెను. నా పేరు స్వయం ప్రభ. ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ ఇక్కడ ఉన్నాను. మీ రిక్కడికి ఏ పని మీద వచ్చారు? ఇక్కడి ఫలాలూ నీళ్ళూ పుచ్చుకుని మీ ఆకలి దప్పులు తీర్చుకుని మీ వృత్తాంతం చెప్పండి."

వానరులందరూ పళ్ళు తిని నీరు తాగి సంతృప్తులయినాక హనుమంతుడు స్వయంప్రభకు తమ పూర్వోత్తరాలు ఇలా చెప్పాడు :

"దశరథ మహారాజు కొడుకు రాముడు త్రిలోకాధిపతి అయిన ఇంద్రుడితో సమానుడు. అతను తన తమ్ముడైన లక్ష్మణుడితోనూ, భార్య అయిన సీతతోనూ దండకారణ్యానికి వచ్చాడు. వారు జనస్థానంలో ఉండగా సీతాదేవిని రావణుడు


Sankar...



బలాత్కారంగా తీసుకుపోయాడు. రాముడి మిత్రుడైన సుగ్రీవుడు సమస్త వానరులకు రాజు. ఆయన సీతాదేవిని వెతికే నిమిత్తమై మమ్మల్ని దక్షిణ దిశకు పంపాడు. మేము దక్షిణ దిశ అంతా కలయ వెతికి, ఆకలి చెంది, అలసిపోయి ఒక చెట్టు కింద కూచుని ఉండగా లతలు కప్పి ఉన్న గొప్ప అంధకార బిలం కనిపించింది. తడి విదిలించుకుంటూ ఈ బిలం నుంచి పక్షులు బయటికి రావటం చూసి నేనే ఈ వానరులందరినీ ప్రోత్సహింప జేసి బిలంలో ప్రవేశించమన్నాను. మేము ఇలా వచ్చి ఇక్కడ చేరుకున్నాం. అదృష్టవశాన నీవు మాకు తటస్థపడి మా ఆకలి తీర్చి, మేలు చేశావు."

హనుమంతుడు స్వయంప్రభకు ఈ విధంగా తమ వృత్తాంతమంతా చెప్పి, "నీవు మాకు ప్రాణదానం చేశావు. దీనికి ఏ ప్రత్యుపకారం కోరినా చేస్తాము. మేము ఈ బిలంలో ప్రవేశించామేగాని ఇందులో నుంచి ఎలా బయట పడాలో తెలియటం లేదు," అన్నాడు.

స్వయంప్రభ తన కేమీ ప్రత్యుపకారం అవసరం లేదనీ, వానరులంతా కళ్ళు మూసుకుంటే వారిని తన తపశ్శక్తిచే బిలం వెలుపల చేర్చుతాననీ అన్నది. వానరులందరూ కళ్ళు మూసి తెరిచేసరికి బిలం వెలపల ఉన్నారు. స్వయంప్రభ వారున్న చోటికి కొండ గుర్తులు చెప్పి బిలంలోకి వెళ్ళి పోయింది.

వింధ్య పర్వతపు పడమటి పార్శ్వపు టంచున కూచుని, పశ్చిమ సముద్రాన్ని చూస్తూ తమ గడువు ముగిసిందనీ, శిశిరం వెళ్ళి వసంతం కూడా రాబోతోందనీ గుణించుకుని వానరు లందరూ చింతలో మునిగిపోయారు.

అప్పుడు అంగదుడు మిగిలిన వానరులతో, "మనమంతా సుగ్రీవుడి ఆజ్ఞకు



లోబడి వచ్చాం. ఆయన చెప్పిన గడువు లోపల సీత జాడ తెలుసుకోలేక పోయాం. ఇప్పటికే ఆయన అజ్ఞ మీరిన వాళ్ళ మయాం. సుగ్రీవుడు చాలా క్రూరుడు, మీదుమిక్కిలి రాజు. మనని క్షమించడు. ఆయన వద్దకు తిరిగి పోవడం కన్న అన్న పానాలు మాని ప్రాయోపవేశం చేసి చావటం మేలు. కావటానికి నేను యువ రాజునే కాని నన్ను యువరాజు చేసినది సుగ్రీవుడు కాదు, రాముడు. సుగ్రీవుడికి నా మీద చాలా పగ ఉన్నది. నేను ఇప్పుడు అతడికి దొరికితే నన్ను ప్రాణాలతో వదలడు," అన్నాడు.



మిగిలిన వానరులు కూడా ఇలాగే భావించారు. కనీసం సీత వార్త అయినా తెలిస్తే రాముడు సంతోషించి, గడువు దాటి నందుకు శిక్ష పడకుండా చూస్తాడేమో! కాని సీత జాడ తెలియక, గడువు దాటి కిష్కింధకు వెళ్ళటం కన్న ఇక్కడే ఉండి పోవటం మేలని వారు భావించారు. ముఖ్యంగా తారుడు వారితో, "ఇంత ఆలోచన దేనికి? మీ కిష్టమైతే ఈ బిలం లోనే ఉండి పోదాం," అన్నాడు.

అంగదుడి మాట కారితనమూ, ధోరణీ గమనిస్తున్న హనుమంతుడు తనలో, "అబ్బో, వీడు సుగ్రీవుడి రాజ్యం కాజేసే లాగే ఉన్నాడే!" అనుకుని వానరులకూ అంగదుడికీ మధ్య భేదం కలిగించటానికి గాను, "అంగదుడా, వానరులకు ఈ క్షణం ఉన్న ఆలోచన మరుక్షణం ఉండదు. వీరందరూ భార్యలనూ బిడ్డలనూ వదిలేసి నీ ఆజ్ఞలు పాలిస్తూ నిజంగానే ఇక్కడ ఉండి పోతారని నమ్ముతున్నావా? ఉన్న మాట చెబుతాను విను. నేనుగాని, ఈ జాంబవంతుడుగాని, నీలుడుగాని, సుహోత్రుడుగాని సుగ్రీవుణ్ణి విడిచి నిన్ను అనుసరించటం కల్ల. అదీగాక బలవంతుడితో వైరం కూడదు. ఈ బిలం నిన్ను లక్ష్మణ



బాణాల నుంచి కూడా రక్షించ లేదు. తెగబడి యుద్ధమే చెయ్యటానికైనా నీవు వాలి కన్న బలశాలివి కావుగదా! ఈ వానరులందరూ నీ మాట అనుసరిస్తారని భ్రమ పడితే త్వరలోనే ఒంటరిగాడివై పోతావు. సుగ్రీవుడికి నీ పైన పగ అన్నది నిజం కాదు. నీ తల్లి పై ఆయనకు ప్రేమ గనక ఆమెను బట్టి నీ పైన కూడా ప్రేమే," అన్నాడు.

ఈ మాట లేవీ అంగదుడి చెవికెక్క లేదు. అతను కోపావేశంతో, "సుగ్రీవుడికి స్థిరబుద్ధీ, ఆత్మశుద్ధీ, చిత్తశుద్ధీ, దయా, పరాక్రమమూ, గాంభీర్యమూ ఏ కోశానా లేవు. అన్న బతికి ఉండగానే తల్లిలాటి వదినెను భార్యను చేసుకున్న పాపి. రాక్షసుడితో పోరటానికి బిలంలోకి దూరిన తన అన్న బయటికి రాకుండా బిలానికి కొండ రాయి అడ్డం పెట్టిన ద్రోహి. తనకు రాజ్యదానం చేసిన రాముణ్ణే మరిచిన కృతఘ్నుడు. లక్ష్మణుడి భయం కొద్దీ సీతాన్వేషణకు గాను మనని పంపాడేగాని అతనికి అధర్మ భయం ఎక్కడిది? అటువంటివాడు, తన కొడుక్కు రాజ్యమిస్తాడుగాని నా కిస్తాడా? తన అజ్ఞ మీరిన వంక పెట్టి నన్ను తప్పక ఉరి తీయిస్తాడు. నేను తిరిగి రాను; ఇక్కడే ప్రాయోపవేశం చేస్తాను. నన్ను వదిలి మీరంతా వెళ్ళండి. రామ లక్ష్మణులకూ, మా పినతండ్రికీ, పినతల్లి రుమకూ నా నమస్కారాలు చెప్పండి. నే నంటే ప్రాణం కన్న ఎక్కువగా చూసే నా తల్లిని ఊరడించండి. ఆమె ఎలాగూ నాకోసం ప్రాణాలు విడుస్తుంది," అని మిగిలిన వానరులకు నమస్కారాలు చేసి, భూమి మీద దర్భలు పరుచుకుని వాటిపై ఏడుస్తూ పడుకున్నాడు.

అంగదుణ్ణి చూసి వానరులందరికీ ఆగకుండా దుఃఖం వచ్చింది. వాళ్ళు వాలిని మెచ్చుకుని సుగ్రీవుణ్ణి తిట్టుతూ, తాము కూడా ప్రాయోపవేశం చేయ నిశ్చయించారు. సముద్రంలో స్నానం చేసి తీరాన దర్భలు

పరిచి వారంతా తూర్పు ముఖంగా పడుకున్నారు. అలా పడుకుని వారు రాముడు అరణ్యవాసానికి బయలుదేరినది మొదలు జరిగిన సంఘటనలన్నీ చెప్పుకుంటూ ఉండగా ఒక భయంకరమైన ఆకారం గల గద్ద వారికి కనిపించింది. దానిని చూస్తూనే భయంతో వారు పెట్టిన కేకలకు గుహలన్నీ మారుమోగాయి.

ఆ వచ్చినది జటాయువు అన్న అయిన సంపాతి. అతను వింధ్య పర్వతం మీది ఒక గుహలో ఉంటున్నాడు. అతను గుహలో నుంచి వెలికి వచ్చి, "దేవుడి దయ వల్ల ఇవాళ నాకు కావలిసినంత ఆహారం! ఈ వానరులందర్నీ వరసగా చంపి కడుపు నింపుకుంటాను," అన్నాడు.

ఆ మాటలు విని అంగదుడు హనుమంతుడితో, "మన కెలాటి గతి పట్టింది? యముడు ఈ గద్ద రూపంలో మనని కడతేర్చ వచ్చాడు. మనమూ రాముడి పని తీర్చినవాళ్ళమూ కాలేదు, సుగ్రీవాజ్ఞ నిర్వర్తించిన వాళ్ళమూ కాలేదు. మన కన్న ఆ జటాయువు మేలు; అతను రాముడి కోసం ప్రాణాలు వదిలాడు. మనం రామకార్యం మీద బయలుదేరామన్న మాటేగాని అది చెయ్యకుండానే ఈ గద్ద నోట పడబోతున్నాం. మన చావుకు ఎన్ని కలిసి



వచ్చాయో! జటాయువు ప్రాణాలు వదలక పోతే మనకు సీతను వెతక వలిసిన పనే ఉండేది కాదు; రావణుడి సంగతి అతనే చెప్పేవాడు. రావణుడు సీత నెత్తుకు పోక పోతే ఆమె కోసం వెతికే పనే ఉండేది కాదు. దశరథుడు చావకపోతే ఏనాడో రాముణ్ణి పిలిపించుకుని ఉండేవాడు. అసలు దశరథుడా కైకేయికి వరాలే ఇవ్వకపోతే ఏ బెడదా ఉండకనేపోను. ఇవన్నీ మన వానరు లందరి ప్రాణం తియ్యటానికే జరిగాయి," అన్నాడు.

సంపాతి గట్టిగా, "ఎవడది? నా తమ్ముడు చచ్చిపోయినట్టు మాట్లాడుతున్నాడు! ఇంత కాలానికి నా తమ్ముడి పేరు విన్నాను గదా అని సంతోషించాను. నాయనలారా, నా రెక్కలు సూర్య కిరణాలకు కాలిపోయాయి. నేను మీ దగ్గిరికి రాలేను. దయచేసి నన్ను మీరున్న చోటికి దించండి," అని అరిచాడు.

వానరులు ఇదంతా దొంగ ఎత్తనుకున్నారు. అయినా తాము చావటానికి సిద్ధమయ్యే ఉన్నారు గనక ఆ చావు ఈ విధంగా త్వరగా రావటం కూడా మేలేనేమోనని వారికి తోచింది. అంగదుడు మాత్రం లేచి వెళ్ళి సంపాతిని కొండ మీది నుంచి దించి కిందికి తెచ్చాడు.

అతను సంపాతితో రాముడు అరణ్యవాసం రావటమూ, జనస్థానంలో ఉన్న సీతను రావణుడు అపహరించటమూ, అది చూసి జటాయువు రావణుడితో ఘోర యుద్ధం చేసి చని పోవటమూ, రామలక్ష్మణులు సీతను వెతుక్కుంటూ ఋశ్యమూకానికి వచ్చి, సుగ్రీవుడి స్నేహం చేసి, వాలిని చంపి, వానర రాజ్యాన్ని సుగ్రీవుడికివ్వటమూ, సుగ్రీవుడు సీతాన్వేషణకై తమను పంపటమూ, తాము విఫలులై, తిరిగి వెళ్ళలేక ప్రాయోపవేశం చెయ్యటమూ వివరించి చెప్పాడు.



ప్రపంచపు వింతలు: **22. బోరో బుదుర్ శిల్పాలు**

జావా ద్వీపం నడిమి ప్రాంతంలో తొమ్మిదవ శతాబ్దం నాటి అద్భుత శిల్పాల శిథిలా లున్నాయి. బోరో బుదుర్ వద్ద గల ఈ శిథిలాలు మలేసియా కంతటికి ప్రసిద్ధమైనవి. ఈ శిల్పాలు ఇక్కడ ఉండిన హిందూ బౌద్ధ నాగరికతకు చెందినవి. ఈ నాగరికతను 15వ శతాబ్దంలో అరబ్బులు తుడిచి పెట్టేశారు.

ఈ శిల్పాలను ఒక చిన్న గుట్టపై, పిరమిడ్ ఆకారంలో, నిర్మించారు. ఇవి అంతస్తులవారీగా కొండ శిఖరం దాకా అమర్చి ఉన్నాయి. మొత్తం అయిదు అంతస్థు లున్నాయి. ఇక్కడి శిల్పాలు ఈ నాటికీ అంతగా చెక్కు చెదరక, బోరో బుదుర్‌కు జగద్విఖ్యాతి కలిగించాయ.

దేవాలయం చుట్టూ జంట వరుసలో రాతి పలకలు అమర్చి వాటిపై శిల్పాలు చెక్కారు. రాళ్ళ మధ్య సిమెంటుగాని, సున్నంగాని లేదు. 1500కు పైగా రాతి పలకలు ఈ చెక్కడాల కొరకు వినియోగించారు. వాటిపై చెక్కిన శిల్పాలు బుద్ధుడి జీవిత దృశ్యాలు. ఈ చెక్కడాల నిడివి మూడు మైళ్ళకు పైబడి ఉన్నదనీ, ఈ ఆలయ నిర్మాణం పెద్ద పిరమిడు [ ఫిబ్రవరి 62 ] నిర్మాణం కన్న కష్టతరమై ఉండవచ్చుననీ భావించబడుతున్నది.






1\. ఎస్. ఆనందరాం, తిరుమల

అగస్టు నెల సంచికలో తాతయ్య కథలు, రామతీర్థ కథలు గాని ప్రచురించ లేదు. ఎందువలన?

అవి అయిపోయాయి.

2\. ఎస్. సి. హెచ్. బి. ప్రసాద్, శ్రీకాకుళం

వాలికి, మండోదరికి అంగదుడు పుట్టాడని కొంద రంటారు. (అంగదుడు) తార కొడుకా, మండోదరి కొడుకా?

అంగదుడు మండోదరికి పుట్టాడన్నది ఒక ప్రవాదులాటిది. అతను తార కొడుకేనని మనం అనుకోవాలి.

3\. ఇ. యస్. వాసులు, బళ్ళారి

సీత లంకలో ఉండినట్లు మొదటి నుంచి తెలియుచున్నది గదా, సీతను వెదకడానికి వానరులను నలుదిక్కులకు పంపుటలో గల అర్థమేమి?

రావణుడు లంకకు రాజని తెలుసును కాని సీత లంకలోనే ఉన్నదనీ, రావణుడు ఆమెను మరొక చోట దాచ లేదనీ సుగ్రీవుడికి ఏమి తెలుసు? సీత లంకలో ఉండే అవకాశమే హెచ్చు గనక దక్షిణంగా వెళ్ళే కోతులకే రాముడి ముద్రిక ఇవ్వబడింది.

4\. వి. నారాయణ, అనంతపూరు

హనుమంతుడి తండ్రి కేసరియా, లేక వాయుదేవుడా? లేక ఇద్దరూ ఒకటేనా?

కేసరి అనుమతితో అతడి భార్య అంజన వాయుదేవుడికి హనుమంతుణ్ణి కన్నట్టు హనుమంతుడి కథలో చదవ లేదా? హనుమంతుడికి ఇద్దరు తండ్రులు. ఇదే విధంగా పాండవు లందరికీ ఇద్దరు తండ్రు లున్నారు. అర్జునుడికి ఒక తండ్రి పాండురాజు, ఇంకో తండ్రి దేవేంద్రుడు. పురాణాలలో ఇది పరిపాటే.

5. ఎ. శేషగిరిరావు, యెమ్మిగనూరు

సృష్టిలో ముందు సూక్ష్మ జీవులు, తరువాత చిన్న చిన్న జంతువులు, తరువాత కోతులు ఉద్భవించి, పిదప కోతుల నుంచి మానవుడు పుట్టాడని శాస్త్రకారుల అభిప్రాయముకదా, మరి మానవుల నుండి మరి యింకొక కొత్త రకం జీవి ఎందుకు పుట్టకూడదు ?

శాస్త్రకారుల అభిప్రాయం కోతుల నుంచి మనుషులు పుట్టారని కాదుగాని, "నాచురల్ సెలెక్షన్" ద్వారా ప్రాణి విజాతులు ఏర్పడి పరిణామం సాగిందని. మానవుడు అవతరించినాక "నాచురల్ సెలెక్షన్" అనేది వెనుక పడింది; మానవుడు సాంఘిక పరిణామాన్ని సాగిస్తున్నాడు. అందుచేత సహజ పరిణామానికి ఇంక అవకాశం ఉన్నట్టు కనబడదు.

6. ఆర్. బలదేవురెడ్డి, హనుమకొండ

జులై సంచికలో భారత చరిత్రయందు చితోడ్ రాణి పద్మిని యొక్క భర్త రాణా రతన్‌సింగ్ అని ప్రచురించారు. కాని చరిత్రలలో భీమసింగు అని వ్రాయబడి యున్నది ?

పద్మినికి సంబంధించిన కథలలో ఆమె భర్త పేరు రాణా భీమసింగ్ అని ఉండవచ్చు. రాజస్థాను కథలలో "టాడ్" కూడా పద్మిని భర్త పేరు భీమ్సి అని అన్నాడు. కాని చరిత్రలో ఉండే పద్మిని భర్త పేరు రాణారతన్ సింగే.

7. బుద్ధిరాజు సుబ్బలక్ష్మి, ఏలూరు

అన్నయ్యా, "దుష్టులతో సహవాసం" [బేతాళ కథ] లో పిశాచీలు లంక రాజుకి కనిపించలేదు అనీ, సమయస్ఫూర్తికి కనిపించినవి అనీ వ్రాశారు. మరి వాళ్ళిద్దరూ మానవులేగా? ఒకళ్ళకు కనిపించి రెండవ వారికి కనిపించకుండా పోవుటకు కారణం ఏమిటి ?

పిశాచాలు మానవులకు కనిపించక పోవటమే స్వాభావికం. అయినప్పటికీ అవి సమయస్ఫూర్తికి కావాలనే కనిపించాయి. అంతే కాకుండా అతను ఇతర మానవులకు కనిపించకుండా కూడా చేశాయి. కథ చదివితే ఈ విషయం స్పష్టం కాలేదా ?

8. ఎం. బాబ్జీ, మచిలీపట్నం

ఫోటో వ్యాఖ్యల పోటీకి మేము ఫోటోలు పంపవచ్చునా ?

మంచి ఫొటోలు ఎవరైనా పంపవచ్చు. కాని మా వద్ద కొన్ని ఏళ్ళకు సరిపోయే ఫోటో లున్నాయని తెలపటం అవసరం.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

అనాటి తంత్రం

పంపినవారు:
వై. సత్యనారాయణ, బంకార

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఈనాటి యంత్రం

పంపినవారు:
వై. సత్యనారాయణ, బంకార

# అగ్నిగోళాలు

★ అగ్నిగోళాలు దిగువ గాలిపొరలో ప్రవేశించినప్పుడు వాయుతరంగాలు సృష్టి అయి గొప్ప ధ్వని పుడుతుంది. వాటి వెంటవచ్చే అపారమైన కాంతీ, ఉరుములాటి శబ్దమూ, ఆకాశంలో గంటల తరబడి నిలిచి కనిపించే పొగమబ్బులూ ఒకసారి కళ్ళార చూసిన వారు జన్మలో మరవలేరు.

★ కొన్ని అగ్నిగోళాలు పొంతం కాలిపోకుండానే నేలపై పడతాయి. ఇవి రాళ్ళముక్కలూ, ఇనపముక్కలూ రూపంలో ఉంటాయి. వీటిని "మిటియరైట్" (ఉల్కకా) లంటారు. వీటి రసాయన స్వరూపాన్నిబట్టి సౌరకూటంలో ఉండే పదార్థంయొక్క స్వభావం గురించి బోలెడంత జ్ఞానం లభించింది.

★ 1929 ఏప్రిల్ 22న బష్కిరియాలో ముగ్గురు వ్యక్తులు వేటకు వెళ్ళారు. దేవదారు అరణ్యంలో చడీ చప్పుడూ లేదు. ఆకాశాన గుడ్డి వెన్నెల మాత్రం ఉన్నది. అకస్మికంగా వేటగాళ్ళున్న ప్రాంతమంతా విద్యుద్దీపాలు వెలిగించినట్టు కాంతివంతమై పోయింది. ఆ సమయానికి వారొక మిట్ట మీద నిలబడి ఉండి, ఆ కాంతికి నిశ్చేష్టులై పోయారు. ఆ వెలుగులో వారికి దేవదారు వృక్షాలు ఆకు పచ్చరంగుగా కనిపించాయి. ఆ చుట్టు పక్కల ఉండే రాళ్ళూ, సెలయేళ్ళూ పగటి కాంతిలోలాగా కనిపించాయి. కళ్ళు మిరుమిట్లు గొలిపే అగ్నిగోళం ఒకటి ఆకు పచ్చ కాంతితో వెలుగుతూ, రవ్వలు చిమ్ముతూ ఆకాశానికి అడ్డంగా పరిగెత్తి చూస్తూండగానే సమసిపోయింది. అది నడిచిన దారి కొంతసేపు కాంతివంతంగా ఉండింది. తిరిగి ఆ ప్రదేశం అంధకారమయమై పోయింది. ఇది జరిగిన ఒకటిన్నర, రెండు నిమిషాలకు, ఎక్కడో ఫిరంగి పేలినట్టుగా, పిడుగుపాటు ధ్వని వినిపించింది, దాని ప్రతి ధ్వని కూడా వినిపించింది. ఇదంతా కళ్ళారా చూసిన ముగ్గురు వేటగాళ్ళలో ఒకడు మర్నాడు తన అనుభవాన్ని లోకానికి వెల్లడించాడు.

★ 1929 మార్చి 1న ఓమ్స్క ప్రాంతంలో తరాజిల్లాలో పడిన అగ్నిగోళం చేసిన ధ్వనులు 125 కిలో మీటర్ల దూరాన రికార్డు అయాయి. వాటి తాలూకు ప్రతి ధ్వనులు 250 కిలో మీటర్ల దూరాన వినిపించాయి.

★ అగ్నిగోళం గాలిపై పొరల నుంచి సాంద్రమైన కింది పొరలకు దిగి వచ్చేటప్పుడు దాని జ్వలనంలో మార్పు కలుగుతుంది. దాని చుట్టూ ఉండే జ్వలిత వాయువుల ప్రమాణం అపారంగా పెరుగుతుంది. ఎగువ పొరలలో నీలంగానూ, ఆకు పచ్చగానూ ఉండే కాంతి దిగువ పొరలలో పసుపు పచ్చ రంగుకూ, ఎర్ర రంగుకూ మారుతుంది.

సాధారణంగా అగ్నిగోళపు కేంద్రం తెల్లగా విద్యుద్దీపంలా ప్రకాశిస్తుంది. దాని చుట్టూ ఉండే వాయువు యొక్క అంచున ఎర్ర కాంతి కానవస్తుంది.

★ అగ్నిగోళంలో ఉత్పత్తి అయే వేలాది డిగ్రీల వేడికి మధ్య ఉండే ఉల్క కరిగి, ఆవిరి కూడా కావచ్చు. కరిగిన ఇనుము చిన్న చిన్న గుండ్లుగా తిరిగి ఘనీభవిస్తుంది. ఈ గుండ్లు గట్టిగా ఉండక, లోపల డొల్లగా ఉంటాయి. అవి ఏర్పడిన సమయాన ఇనుము సలసలా మరుగుతున్నదని దీనిని బట్టి తెలుస్తుంది. ఆవిరి అయిన ఇనుము సన్నని ధూళి నలుసులుగా ఏర్పడి అగ్నిగోళం వెళ్ళిన దారిలో అనేక గంటలపాటు నిలిచి ఉండిన సమయాలున్నాయి. మామూలుగా ఉల్కలు ఎగువ గాలి పొరలలో చేసే కాంతి చారలు మాయమైనంత శీఘ్రంగా అగ్నిగోళాలు దిగువ పొరలలో చేసే చారలు మాయం కావు.

★ స్పూత్నిక్‌లను మనం కృత్రిమ ఉపగ్రహా లంటున్నాం. అవి కృత్రిమ అగ్నిగోళాలు కూడానూ! ఎందుచేత నంటే, అవి భూమి చుట్టూ పరిభ్రమించే ఎత్తున కొంత గాలి ఉంటుంది; ఈ గాలి పొరలు క్రమంగా స్పూత్నిక్ గమనాన్ని కొద్ది కొద్దిగా నిరోధించి వాటి వేగాన్ని తగ్గిస్తాయి. వేగం తగ్గుతున్న కొద్దీ స్పూత్నిక్ భూమికి చేరువగా వస్తుంది. క్రమంగా అది ఉల్కలు మండే గాలి పొరలను చేరుకుని తానే ఒక బ్రహ్మాండమైన ఉల్కగా (అగ్నిగోళంగా) తయారవుతుంది. ఇలా ఏర్పడిన అగ్ని గోళాన్ని కంటితో పరిశీలించటం సాధ్యం కాదు, కాని రాడారుతో పరిశీలించ వచ్చు. సహజమైన అగ్నిగోళాలను పరిశీలించటం కన్న ఈ కృత్రిమ అగ్నిగోళాలను పరిశీలించటం హెచ్చు ఫలప్రదం. ఎందుకంటే స్పూత్నిక్ ఆకారమూ, బరువూ, వేగమూ పరిశోధకులకు తెలిసి ఉంటుంది.

★ 1957 అక్టోబరు 4న రష్యనులు ప్రయోగించిన మొదటి స్పూత్నిక్ 1958 జనవరి 3న కృత్రిమ అగ్నిగోళంగా మారింది; మొదట అది రెండు ముక్కలై, తరవాత 8 ముక్క లయింది. రెండవ స్పూత్నిక్ 1958 ఏప్రిలు 14న బ్రెజిల్ మీదా అట్లాంటిక్ సముద్రం మీదా పోతూ ఉండగా నిర్మూల మయింది. ఈ కృత్రిమ ఉల్కలను పరిశోధించటం ఇటీవలనే ఆరంభ మయినప్పటికీ, ఈ పరిశోధనల ద్వారా ఉల్కలను గురించి ఎన్నో విషయాలు తెలిశాయి.

★ కాలగా మిగిలిన అగ్నిగోళాల శకలాలు వివిధ ప్రమాణాలలో ఉంటాయి. సిఖోతె అలిన్ అగ్నిగోళ శకలాలలో పెద్దది. 1,745 కిలో గ్రాముల బరువున్నది. ఆఫ్రికాలో 60 టన్నుల బరువుగల ఇనప "ఉల్కకం" (మిటియరైటు) పడింది. లాంగ్ ఐలండ్‌లో 564 కిలో గ్రాముల బరువు గల రాతి ఉల్కకం పడింది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఆనాటి తంత్రం

రెండవ ఫోటో: ఈనాటి యంత్రం

పంపినవారు: వై. సత్యనారాయణ,

బంకార, (హౌరా జిల్లా.)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'







# బిన్నీవారి
# కేస్‌మెంట్
# బట్ట B. 5586

స్కూలు
యూనిఫారమ్‌లకు
ఉత్కృష్టము

(WT-BM-CC-2133

దిట్టమైనప్పటికి మెత్తని ఈ బట్ట స్కూలు యూనిఫారమ్‌లు, ట్యూనిక్‌లు, స్కర్టులు మరియు షార్టులకు పెరుగుతూన్న అవసరాలను తీర్చడానికి ప్రత్యేకముగా డిజైను కావింపబడినది.




ది బెంగుళూరు ఉలెన్, కాటన్ &
సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్,. అగ్రహారం రోడ్డు, బెంగుళూరు 23 బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ వారి శాఖ

